# సుయోధన శృంగభంగము

అను

# ఘోషయాత్ర.

శ్రీ శ్రీ శ్రీ జయపురాధీశులగు శ్రీ విక్రమదేవవర్మ
మహారాజులుంగారికి భక్తితో నంకితము చేయఁబడినది.

రచయిత:

కల్యాల జయరామయ్య.

# సుయోధన శృంగభంగము

అను

# ఘోష యాత్ర

శ్రీశ్రీశ్రీ జయపురాధీశులగు శ్రీ విక్రమదేవవర్మ
మహారాజులుంగారికి భక్తితో నంకితము చేయఁబడినది.

రచయిత:

మల్యాల జయరామయ్య.

శ్రీ ర స్తు.

బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహ కవిగారి యభిప్రాయము.

శ్రీ మల్యాల జయరామయ్యగారిచే రచియింపఁబడిన సుయోధన శృంగభంగ మను నామాంతరము గల ఘోష యాత్రా నాటకమును సమగ్రముగా వింటిని. కవి కిది ప్రథమ ప్రయత్నమయిననూ కథా సంవిధానము చమత్కారముగాఁ గల్పింపబడినది. కవిత్వమునూ మృదువుగా నున్నది. కవి ముందుముందు గట్టి కృషి చేసిన రసవంతములయిన కావ్యములు రచియింపఁగలఁడని నేను విశ్వసించుచున్నాను. పరమేశ్వరుఁ డీయనకు దీర్ఘాయురారోగ్యభాగ్యము లిచ్చి భాషాసేవఁ జేయునట్లను గ్రహించుఁగాక !

రాజమహేంద్రవరము,
28—4—1939.

చి॥ ల॥ నరసింహాము.

కవిసార్వభౌమ, కళాప్రపూర్ణ, ఆంధ్రవ్యాస, మహా మహోపాధ్యాయాది బిరుదాంకితు లగు బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగా రిచ్చిన యభిప్రాయము:—

శ్రీరస్తు చిరంజీవులైన మల్యాల జయరామయ్య ప్రథమ ప్రయత్నముగా రచియించిన "సుయోధన శృంగభంగమ" ను "ఘోషయాత్ర" యను మూఁడు అంకముల నాటకమంతయు నితఁడే చదివి నాకు వినిపించినాఁడు. ఈఘోషయాత్ర చక్కఁగా కూర్పఁబడినది. కవిత్వము మృదుమధురముగా నున్నది. ఈతఁడు చిన్నవాఁడయిననూ పూర్వ కవుల యాచారములయందు మిక్కిలి ప్రీతిగలవాఁడు. గ్రామ్యవాద మీతని కిష్టములేదు,

తెలియని దేదేని తప్పు ప్రయోగించినప్పు డిది యిట్టిదని చెప్పిన శిరసావహించి దాని నొప్పుకొని దిద్దుకొనుటకు ప్రయత్నించును. ఈతఁ డిట్లు విడువక గ్రంథములు వ్రాయుచుండిన మిక్కిలి మనోహరమైన కవిత్వము చెప్పి లోకము నానందింపఁ జేయఁగలఁ డని నా నమ్మకము. పరమేశ్వరుఁ డీ బాలకవి కాయురారోగ్యైశ్వర్యము లొసంగుఁగాక యని కోరుచున్నాను.

రాజమహేంద్రవరము, }
28—4—1939. }

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.

కింకవీంద్ర ఘటాపంచానన, కళాప్రపూర్ణాది బిరుదాంకితు లగు బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగా రొసంగిన యభిప్రాయము.

"సుయోధన శృంగభంగము". ఈనాటకమును మల్యాల జయరామయ్యగారు విరచించిరి. నాకు చూపిరి. ఇందలి మూఁడు రంగములు నేను చతుస్సరక్షర సంయోగముగాఁ జూచితిని. ధారాశుద్ధియు, కథాకల్పనమును హృదయంగమముగా నున్నవి. వ్రాత పొరబాట్లు తప్ప తదితరలోపములు లేవు. గ్రంథకర్త కియ్యది ప్రథమ ప్రయత్నమైననూ ప్రథమ ప్రయత్నమువలె నుండక అనుకూలముగ నున్నది. భగవంతుఁ డీ గ్రంథకర్తకు ఆయురారోగ్య భాగ్యాదులు దయచేసి యిత్యోధికమైన గ్రంథరచనా పాటవము ననుగ్రహించుగాక యని యాశీర్వదింపుచున్నాఁడను.

కడియము, తూ॥ గో॥ జిల్లా, }
30—4—1939. }

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి
శతావధాని.

# కృతిసమర్పణము.

కందగీతగర్భోత్పలము.

శ్రీవర సత్కవి వినుతశీల రమాంచిత వేడుకొంటి రా
జీవముగాఁగ నా రచన జేర్చితి గైకొను రాణనొప్ప గా
భూవర గైకొనవే సరసమోదగసజ్ఞత చాలవెల్గుతన్
భావనమైన శ్రీ దిశలఁబర్వను విక్రమదేవభూపతీ.

గీ. కన్య నిమ్మని యడుగుట ఘనతకాదు
వలచి వచ్చిన నిరసింపఁ బాడిగాదు
అదియు నిదియును గాకుండ నమరెగాన
దీని గొనుమయ్య! విక్రమదేవవర్య!

సీ. నన్నపార్యునిఁ బ్రీతిఁ గన్న చిన్నికుమారి
రాజరాజనరేంద్రు రాణి యయ్యె
తిక్కనార్యునిమొక్క చక్కని లతకూన
మనుమసిద్ధికిఁ బట్టమహిషియయ్యె
శ్రీనాథకవిరాజు చిన్నివన్నెలకన్నె
రెడ్డిరాజులఁబట్టి దొడ్డదయ్యె
హంపీమహాక్షేత్రమందు పుట్టిన జాణ
యాంధ్రభోజుని యంకమందు వెలసె

గీ. అట్టి కవితాలలామ యిప్పటిమునాన
పూర్ణమహా సర్వకన్యలతోఁ బోలుపు మీఱి
నిన్నువరియించి దఱిఁ జేరు నేఁడు దయను
బ్రోచు మా ఘనుఁడీవని ప్రోఁచు కతన.

గీ. రాజు నీ వయ్థా చకోరముల కెప్పుడు
ఘనుఁడ నీ వయ్థా చాతకములకిలను
సరసు వగుదీవు సత్కవిజలజములకు
దివ్యగుణధామ! విక్రమదేవనామ!

చంపకపుష్పమాలికాబంధము.

నరవర హారరత్న నయనమ్మున నాదర మూరగారతిక్
సరసర శారదాంబ సరిసత్రసమూనుచుఁ గాంచుగాచుగా
క! రహిరమా రహించు కవికల్పక! విక్రమనామధీమణీ!
గరగరయార్ర నాటకపుకన్యకనందుము యోమహామహా!

ఇట్లు భవద్విధేయుఁడు
మల్యాల జయరామయ్య.

# పీఠిక.

---

చతుర్విధాభినయములతోఁ గూడుకొని సంగీతము, సాహిత్యము, చిత్రకళ దోహదము లాఁగా మానవ ప్రకృతిని చిత్రించు లలితకళయే నాట్యకళ. నాటక మనునది నటనానుగుణ్యముగ నుండి చదువని వారికేని జ్ఞానమును బ్రబోధించుట కుపకరించు నుత్తమపరికరము. మఱియు నియ్యది మానవహృదయ వికాసమునకుఁ దోడ్పడి రసావేశముఁ గల్గించి తన్మయత్వంబు నొందించును.

అట్టి నాట్యకళయందు సర్వవిషయముల నౌన్నత్యము వహించిన యాంధ్రసరస్వతి వెనుకంజ వేయుట మన దురదృష్టము. ఘనులైన మన పూర్వసత్కవులొక్క రూపకమేని యనుగ్రహింపకుండుట మన ప్రారబ్ధమే! కవిబ్రహ్మ తిక్కనయే యేదేని నాటకము రచించినచో నది జగత్ప్రఖ్యాతిగాంచిన నాటకములన్నిఁటిలోఁ దలమానికముగ నుండియుండు ననిన నతిశయోక్తిగాదు. అంతటి యదృష్టమున కాంధ్రలోకము నోచుకొనలేదు. కావున ప్రకృతము నాట్యకళకు ప్రతియాంధ్రుఁడును సహాయభూతుఁడగుట ప్రయత్నము—ఫలము దైవానుగ్రహము.

ఇఁక స్వవిషయము: ఈపొత్తమచ్చగు చోటునకు నాయునికి దవ్వగుటచేతను, మఱికొన్ని యవాంతరములవల్లను అచ్చు (ఁ; ఱ—;ర థ—ధ; spaces) తప్పులు హెచ్చుగా

నున్నవి. సాధ్యమైనంతవఱకుఁ బట్టిక తయారొనర్చితిని. అచ్చు టచ్చుట నఖండయతివాడుటయు వర్గయతియందు స్వతంత్రించు టయుఁ దటస్థించినది. రసపోషణార్థమై కొన్నిపద్యములయందు నూతనమార్గ మవలంబించితిని. సంధులను జాలవఱకు విడ దీసియే వ్రాసియుంటిని. ఇంకను నాకు తెలియని లోపము లేవేని యున్న యెడల సహృదయులు వానిని దయతోఁ దెలిపి నచో పునర్ముద్రణమున—అంతటియదృష్టమే యబ్బిన— సంతసముతో స్వీకరించి సవరించుకొనియెదను.

శిష్యవాత్సల్యముతో నాయీయుత్తమును బరిశీలించి తమయభిప్రాయముల నొసంగిన కవిపుంగవులకు నావినయ పూర్వకకృతజ్ఞతాభివందనములు. నాటకరచనయందేగాక సర్వ విధములను బ్రోత్సహించిన నామిత్రుఁడు నోరి శ్రీరామచంద్ర మూర్తికి నేనెంతయుఁ గృతజ్ఞుఁడను.

ఇట్లు

పెద్దాపురము
25–6–39

గ్రంథకర్త.



సుబోధన

# శృంగభంగము

[అను ఘోషయాత్ర.]

[నాంది]

శ్రితజనుల పాలికల్ప
క్షితిజమయిన భక్తవరదుఁ గీర్తింతును స
ద్భృత్యతతికి రసజ్ఞతయు నం
చితమగు వాక్స్ఫూర్తినాకు చేకుఱఁజేయన్॥

మ॥ పరిపూర్ణంబును శక్తిమంతమును భావాతీతమున్ జ్ఞానసం
భరితంబున్ గనుపాపకందని యసామాన్యంపు తేజంబునా
పరమాత్మన్ భజియింతు ధర్మరతులై భాసిల్లు సభ్యాళికిన్
బరపక్షంబునకైన మేల్తలపు సద్భావంబుఁ గల్పింపగా

[నాద్యంతముఁ బూలుచల్లబఁడిన వెనుక]

గుణగ్రహణపారీణులగు నో కవిపండిత గాయకజనాగ్రే
సరులారా! నానావిధాలంకార భూయిష్ఠంబును బహుర
సాశ్రయంబును వివిధకళాపాత్రశోభిత రంగస్థానంబును నగు



సుబోధక

# శృంగభంగము

## మొదటి అంకము.

—: తొలి రంగము :—

[ప్రదేశము : దైవతవనములో నొకభాగము. ప్రవేశము . వీణ వాయించుచు హరినామసంకీర్తనము చేసుకొనుచు నారదుడు]

నారదుడు:— ఆహా! పరాత్పరా! ఏమినీసృష్టినిర్మాణ నైపుణ్యము!!

సీ॥ తేజంబుమిగుల నుత్తేజించునట్లుగాఁ
చీఁకటి కోటిని సృజించినావు
సత్యంపు శక్తి విస్తారంబువెలయఁగా
మిథ్యను గోటి నిర్మించినావు
సాధుత్వము రహింప సంకేతమనునట్లు
క్రూరత్వమును నెలకొల్పినావు
గుణముల గుణములు కోటిరెట్లగునట్లు
దుర్గుణంబులను సృష్టించినావు

గీ॥ స్వర్గతల సౌఖ్యముఁ దెలియఁజాలునట్లు
లీల నరకబాధలను గల్పించినావు
హేమ గుణమును మూల్యము నెఱుకపఱుప
గీటురాతిని సృష్టించు వాటముగను 1

నీ సృష్టి ద్వంద్వ భూయిష్ఠము! ఔరా! అదియెఱిఁగి యుండియుఁగూడ

చం॥ ఒకయెడఁ బాండునందనుల యోరిమిఁ జూడఁగ జాలిపుట్టు నిం
కొకయెడఁ గౌరవేశ్వరుని యుద్ధతిఁ గన్గొనినంత క్రోధ మిం
తయు నిటఁ బాండవోత్తముల తాల్మికి మెచ్చెదు యుక్తిఁ గూర్పుమ
చ్చికనొక మాఱు వీఁగఁ జేయుము సర్వము నద్భుతంబుగన్ 2

(పరిక్రమించి యెదుటఁ జూచి] అదిగో! పాండవులు. ఎట్లున్నారో!

ఉ॥ ఒప్పక యువ్వనంబుల ననోర్చి చరించుట - కష్టకాలముం
ద్రిప్పి, త్రయోదశాబ్దములు దీఱి, విరోధుల యుక్కడంచు టిం
కెప్పుడటంచు మానుషము నెంచుచునుండిరి వీరు నీఱుపైఁ
గప్పిన నిప్పుచందమునఁ గాసల. లోక మెఱుంగకుండునే? 3

అయ్యో! పాపము!

మ॥ సకలోర్వీతలనాథులం గెలిచి విస్తారంబు గాంధారిసూ
తికిఁ గన్నుట్టఁగ రాజసూయమును సాధింపంగ నారాజునీ
ర్ష్యకు మూలంబగునట్టి ధామమున సభన్ రాజిల్లఁగాఁ జూచి నేఁ
డకటా! కానలఁ జూడఁగావలసెనే న్యాయాత్ములన్వీరలన్ 4

ఎట్లు భిన్న భిన్న ప్రవృత్తులఁ బ్రసాదించితివయ్యా
స్వామి ఏమి నీలీల? [హరినామసంకీర్తన చేయుచు నిష్క్రమించును]

— రెండవ రంగము —

[ప్రదేశము : పాండవులయాశ్రమము. ప్రవేశము:- వింటినారి సవరించుకొనుచున్న అర్జునుడు, సృష్టివైచిత్ర్యమును బరిశీలించుచున్న ధర్మరాజు]

ధర్మ— విశ్వనాథా ! కరుణాత్మా ! నీవిశ్వలీలామహానాటకమే మని వర్ణింపఁగలాఁడను ? ప్రకృతి యంతెల్ల కన్పింతు వయ్యా స్వామీ !

సీ॥ కుసుమంబులందలి కోమలత్వంబును
సరసులయందలి చల్లఁదనము
లోకబాంధవుకాంతిలోని తీక్ష్ణతయును
జ్యోత్స్నయందున నాహ్లాదనము
ప్రేమామృతమునఁ గాన్పించుమాధుర్యంబు
బాలలీలలఁ బరఁగు మురిపెము
కవివాక్యములలోని ఘనతరజీవంబు
చెలువారు ప్రాణిలో జీవకళయు
గీ॥ నవరసంబులనున్న మార్దవపు సొగసు
గానమం దొప్పుహాయి నీకళలుగాదె ?
ప్రకృతిఁగావించి నీవంకఁ బ్రజలవాఁకొ !
విత్తునం జెట్టుపొల్చెడు విధముగాఁగ. 5

అట్టి ఈ నీసృష్టిలో మనల నీయంతర్నాటకము లేల ? జగంబంతయు నీకళయేయై నీయంశములతో నిండియుండు నపుడీపగ లేల ? వగ లేల? అందఱము నేకోదరులమే కాదా ?

[అర్జునునిజూచి] అర్జునా ! హస్తిపురిలోని మనవారిక్షేమ సమాచారములు తెలిసి చాలదినములైనది సుమా !

అర్జు — అన్నా ! మనము వచ్చినను బ్రదికినను వారికక్కఱలేదే! అట్టివారి గోల మనకేల ?

ధర్మ — అట్లనకుము అనకుము. తాతగారికి మనక్షేమమక్కఱ లేదా ? గురుపుత్రునకి మనము విరోధులమా ? విదురాదులు మనమేలుకోరరా ? అందఱుం బాంధవహితులే !

[తెరలోవీణాగానము] అర్జునా ! నారదమహర్షి కాబోలును.

అర్జు — అగును. త్రిలోకసంచారులగు బ్రహ్మమానసపుత్రులే !

[అప్పుడు నారదుఁడు ప్రవేశించుచున్నాఁడు]

ధర్మార్జునులు — మునీంద్రా! నమస్కారములు. దయచేయుఁడు ఈ యాసనమలంకరింపుఁడు [కృష్ణాజినముఁజూపుదురు]

నార — విజయోస్తు. అఖండయశః ప్రాప్తిరస్తు [కూర్చుండును.]

ద్రౌపది అర్ఘ్యము పాద్యము పూవులు తెచ్చును. ఆమెనీరు పోయుచుండగా ధర్మజుఁడు పాదప్రక్షాళనము చేయుచుండును అర్జునుఁడు [విసరుచుండును.]

ధర్మ — ఉ! ఎక్కడనుండి వచ్చుట మునీశ్వర ?

నార — [నవ్వి] నీమనసెక్కడ నిప్పుడు లగ్నమైనదో అక్కడ నుండియే !

ధర్మ:— ...................నా స్త్రీపురానసందఱుం
జక్కగనుండిరే ? సుఖమె సాధుప్రజలై చరియించువారికిన్ ?
అక్కురునాథుఁ డున్నతులు హాయిగనుండిరె? మాత సేమమే?
మక్కువఁదాత యుంగురుఁడు మమ్ముఁదలంతురె యెప్పుడేని
[యున్ ? 6

నార:— ఓయీ వెఱ్ఱి ధర్మరాజా!

ఉ॥ అందఱు సేమమే! వలయునంతయు బంధుగులందఱుంగటా !
ఎందఱికిష్టు లీరొగణియింపని తాతయునొజ్జ దప్పనిా
కుందవలంపు తేఁగఁపఁగు కూళలెయందఱు వారిరొంతు వే
ఎంకలకిట్టులీప్ప భుజియించెడివారి భజింపఁ జూచెదో? 7

ధర్మ:— మునీంద్రా! అట్లనెదరేమి? విదురుఁడు చేసినమేలు, ఆంబికేయుఁడు చూపినప్రేమ, ద్రోణగాంగేయులు కనుపఱచిన వాత్సల్యము మఱవఁదగినవా?

నార:— వారిమాటకాదు, తక్కినముష్కరుడు—

అర్జు:— వారా? వారుపెట్టిన యిక్కట్టులు వారిని మఱపునకుఁ దేకున్నవి.

నార:— అప్పను మఱవఁగూడదని చెప్పలేవారు.

అర్జు:— వారికి దూరముగ వనమునుండిన నేమాకు సుఖము స్వామీ!

నార:— నిజము నిజము. ఆనాఁడు పాపము ! విషముపెట్టి-నీటఁ దోసి—

ధర్మ:—[లోలోందరతో] ఆర్యా! క్షమింపుఁడు. భీమసేనుఁడు వచ్చువేళయైనది. మీరీ విషయముల జ్ఞప్తికిఁదెచ్చినచో—

ద్రౌప:—వీరిచ్చట నిలువలేరు పాపము.

అర్జు:—ఆతనికిఁబట్టుదగ్గుణములు చాలనున్నవి స్వామీ! ఈమాటలు విన్న నగ్గిపై గుగ్గిలముఁ జల్లినట్లగును.

నార:—అతఁడెక్కడికేఁగెను? కనలేరే?

ధర్మ:—మానిచంద్రమా! నేనిమధ్య "సవ్యస్కందనయజ్ఞమాచరింపఁబోవుచున్నాఁడను. తత్సాధనంబులగు పరికరంబులు-

అర్జు:—ఎందెందుగలవో వెదుకఁగదరిగినాఁడు.

ద్రౌప:—అదిగో వారును వచ్చుచున్నారు మాటలోనే.

[భీమ, నకుల సహదేవులు ప్రవేశించి నారదునకు నమస్కరింతురు]

నార:—వాంఛాఫలసిద్ధిరస్తు! అమాయకులారా! పాపమాఖలుల వలన పడరానిపాట్లు పడుచున్నారా?

అర్జు:—[విచారముతో] మునీంద్రా! అతిదీర్ఘములైన యీవనవాసక్లేశము లెప్పుడైన దీరునా?

భీము:—ఆ! తీరఁగలవు. అవమానపరంపర వారినందిననాఁడు.

సహ:—మా పరాభవాగ్ని—

ద్రౌప:—నా శోకవహ్నియు నెప్పుడైన ఆఱునా?

అర్జు:—జయలక్ష్మియు రాజ్యలక్ష్మియు మాకున్నకెప్పుడైన చేకూరునా?

నకు:—ఆర్యా! నాకొక సందేహము.

చ॥ పుడమి సమస్తముఁ గొనిరి కోయదికోరఁగుగాని యిప్పుడీ
యడవులఁ ద్రిమ్మరంబనుచు నంతటి యక్క అయేమి కర్గెనో?

ద్రౌ:—[రోషముతో]
ఇడుమలలో నడంగి ప్రభవించిన బాధ సహింపకుండుట
న్మడిసిన రాజ్యమంతయును నాఁచికొనందనునంచు నెంచియే!

నార:—అమ్మా! రాచబిడ్డ విట్టిమాటలాడఁదగునా? నీకేమి?
అనన్యసామాన్యులైన యోధులు నాథులు.

ద్రౌపది:—అగును స్వామీ! నాకేమిలోటు? వీరేమి సా
మాన్యయోధులా?

ఉ॥ పుట్టితిరాజవంశమునఁ భూరిబలాఢ్యు ల(నంబుసు) వీరె నేపురం
బట్టితి-నట్టి-సన్నాగి-సభాస్థలి ముట్టఁగరాని వేళనే.
ముట్టఁగఁగూడనట్టి - యొకమార్గుఁడు నెట్టనఁగట్టుపుట్టముల్
బట్టిగ్రహింపనూరుకొనునాథులు యోధులు గారెసంయమీ

సహ:—[తనలో] అబ్బా! ఈ మెప్పులుపులు ములుకులవలె
నాటుచున్నవే! [ప్రకాశముగా] అన్నలారా!

మ॥ కనుధర్మాత్ములెవీరాలెల్లనయిరేఁ శాస్త్రంబు భావింపరే?
ఉనుగంజెల్లునె బాహుశక్తి? సకలంబూహింపగావ్యర్థమె
వ్వాఁడు సామర్థ్యముఁ జూపుపోయుతఁ జెరో పార్థుండు సా
[మ్రాజ్యమా
తఁడెయేలందగు నేలునాతఁడె సమస్తంబాతఁడొందంగదే!

భీ:—[కోపముతో] సామ్రాజ్యమో గీమ్రాజ్యమో నాకే మియు నక్కఱలేదు. నాకోరున దొక్కటియే!

ఉ॥ ఎప్పుడు ద్వాదశాబ్దములనీది బయల్పడువార మొకొ్కో! మా
  మప్పులు పూర్తిగానెపుడు ముప్పటిలుం-గురురాజునూరులే
  నెప్పుడు చెండెదన్ ఖలుల నెప్పుడు చంపెద-దుస్ససేనునిం
  కెప్పుడు గుండెచీల్చుకొని యెప్పుడు ద్రావెద వేఁడిరక్తమున్.

ధర్మ:—భీమసేనా! శాంతింపుము. దేవీ! తొందరపడకుము.

కం॥ సోదరులారా మఱవకు
  ఖేదము లలవాటుచేతఁ గ్రీడలగునుగా
  మోదము సుఖమగుసుండీ
  యాదీనవము విమక్రిమిన్యాయముచేతన్. 12

ద్రౌ:—[రోషముతో] ఆహా! ఏమివేదాంతముండీ

మ॥ ఖలుఁడొక్కండటుగొప్పవట్టుకొనిలాగంజూచునాఁడున్-
(మదాం
  ధులునన్ హేళనఁజేయఁగాంచునపుడున్ గష్టుండురమ్మంచుఁదా
  దొడసూపన్ గనునాఁడు మీఁద మిగులన్ద్వ్యాసనుండట్లు నా
  వలువల్లాగఁగఁ జూచునాఁడు గనలేవా? వెట్టివేదాంతముల్

భీము:—[రౌద్రముతో] అట్టిదుష్టుల నుపేక్షసేయుంజనదు.

గీ॥ అన్న నిర్బంధమేమి లేకున్ననాఁడు
  కురుకుల సరస్సులో నేన్గుకొదమనొచు
  ధార్తరాష్ట్రులు నాఁబడు తామరలను
  జీల్చి పెకలించి చెండి భుజింపనొకొ్కో!

ధర్మ:—అబ్బా ! [పశ్చాత్తాపమును సూచింపుచు] ఇంతకును జూదమాడుట స్వయంకృతాపరాధము.

నార:—అట్లనెదవేమి ? అది క్షాత్త్రము,

ధర్మ:—అప్పుడు రాజునగుటచే నాడవలసి వచ్చినది. కాని రెండు మారులాడుట—?

ద్రౌ:—జూదమాడుట క్షాత్త్రము. యుద్ధముచేసి శత్రువులజంపుటో ! కాదుకాఁబోలును. ఇదియా క్షాత్త్రము ? మగతనము ?

ధర్మ:—అగును ద్రౌపదీ ! నేనెంతునను జెంకువాఁడనుగాను నిజమే

మ॥ అటుపార్థుండనుగానుజన్మి రిపుసంహారంబు గావింప-నే
నిటు సన్యాసినిగాను తమ్ములను నిన్నిల్లాలిఁబాయుంగ-బా
సట గోవిందుఁడుగల్గినాకు భయబ్రష్టత్వంబు వాటిల్లె-నె
న్నటికో యీానెపమంతరించుట హరీ నాప్రాణితో పోవునా ?

అర్జునాదులు:—[చెవులుమూసుకొని] హరిహరీ ! అమంగళములు ప్రతిహతము లగునుగాక !

నార:—వెఱ్ఱివాఁడా ! ఆపదలు కాపురముండునా ? ఏటికింత యాగ్రహము ? ఊరడిల్లుము. అమంగళముల నుచ్చరింపకుము.

భీమ ద్రౌపదులు,—ఆర్యా ! ఆగ్రహింపకుఁడు. క్షమింపుఁడు. లోలోనరగులుచున్న క్రోధాగ్నిచే నోడలు తెలియక యేమేమో యంటిమి.

ధర్మ:— క్షమించుట కేమున్నది ? అంతయు మనమేలునకే !

ఉ॥ ఏకకులంబునందు జనియించినవారము-మెట్టినాము కే
యోకర-మొక్క-పేరిరుని యొద్ద ఫరించినవార-మెట్లొ శ్రీ
కై కలహంబు గల్గనది కారణమంచును దీర్ఘ కోపమా ?
లోకము నవ్విపోవ మనలో మన కేల వివాదమింతగా ?

నార:—ఏమి ధర్మరాజువయ్యా ! నీధర్మమేనిన్నుఁగాచుఁగాక ! నీకుఁ గీర్తిఁదెచ్చుఁగాక ! పుణ్య పురుషులారా ! నాకు సెలవా ?

ధర్మ—స్వామీ! ఏమంత తొందర ? వచ్చినదొక యడుగును రానిదొక యడుగును గదా!

నార—రాజా నాకింకను జాల తొందరపనులున్నవి. ఇచ్చటికి రాకుండగనే యుండదలఁచుకొంటినిగాని మిమ్ములఁజూడవ లెనని కుతూహలముతో

ధర్మ— మీదయకు కృతజ్ఞులము.

ద్రౌపది— స్వామీ! యజ్ఞకాలమునకైన వచ్చెదరా ?

నార—అమ్మా ! ఆనాఁటి దృశ్యములఁజూడకుండనే ! ఎంత మాట ! కొన్నాళ్లిందిందేయుండి పుష్కలముగ భోజనములు చేసి తృప్తితోగాని దేవలోకమున కేఁగను.

అర్జు— సంయమీంద్రా ! సంతోషము.

నార— మఱి-ఇఁక-నాలస్యమెందులకు ? [లేచును]

ధర్మ—చిత్తము.

నార—[పోవుచు వెనుదిరిగి] మఱచితిని చూడు ధర్మరాజా ! మరల హస్తినాపురమునకుఁగూడ పోవలసియుందునేమో! ఏమైన—

ధర్మ—చెప్పుటకేమున్నది స్వామీ !

సీ॥ తాతకు గురునకు తండ్రికి వందన్యాలా
వారికిమా నమస్కారమనుఁడు
తమ్ములపిల్లల తమవారియందఱి
క్షేమంబు మేమడిగితిమియనుఁడు
కొట్టాలు తమ్ములు కోష్ఠాధాస నాఁడొన
రింపు మ్ప్రతినలు సైరింపుమనుఁడు
కల్లజూదంబాది కాలంబు గడవక
పడరాని యిడుమలఁ బడితిమనుఁడు.

గీ॥ అడవికానాఁడు వచ్చుటయాదినేఁటి
వఱకు సుఖమన్న మాటయే యెఱుఁగమనుఁడు
బ్రతికి చెడితిగిగ్గైన మీవారమనుఁడు
బ్రతికి మిముఁజేరు నాశలువాసిరనుఁడు. 17

నార—[సందేహముగా తనలో] ఏమి ! ఇవి ధర్మరాజు వాక్యములేనా ? [ప్రకాశముగా] మఱినేరుగవచ్చునా ?

ధర్మ—చిత్తము.

అందఱు—వందనములు

నార—ధర్మయేవజయతు [హరినామసంకీర్తనము చేసుకొనుచు నిష్క్రమించును] తెరపడును.

---

—॥ మూఁడవ రంగము ॥—

[ప్రదేశము: కరిపుగరాజభవనమునఁ గురురాజుకొల్వుప్రవేశము: యథోచితముగఁ గూర్చుండిన యంధరాజు ధృతరాష్ట్రుఁడు భీష్ముఁడు విదురుఁడు ద్రోణుఁడు మొదలైనవారు.]

ధృతరాష్ట్రుఁడు—నాయనా! విదురా! మన దుర్యోధనాదులిం కెప్పుడు ప్రజాభిమానమునకుఁ బాత్రులగుదురో కదా!

విదు—అగును రాజా! మూర్ఖాగ్రేసరులైనను ధర్మజునిపైఁ బ్రజలకెంత మక్కువ?

ధృత—అట్టి సదభిప్రాయము మన దుర్యోధనునిమీఁదఁ బ్రజల కెప్పుడుకల్గునో! నాబొందెలో జీవముండగ నెప్పుడైన యామాట విందునా?

భీష్మ—(తనలో) ధర్మరాజునకును దుర్యోధనునకును హస్తి మశకాంతర భేదము.

ద్రోణు—(తనలో) దుర్యోధనుఁడెక్కడ? ధర్మరాజెక్కడ? నక్కయెక్కడ! దేవలోకమెక్కడ!!

శకుని—బావా! అదేమట్లనెదరు? అతని వయస్సెంత? అతఁ డెంత?

ధృత—సౌబలా! అతనికన్న ధర్మజుఁడేపాటి పెద్దవాఁడోయి? గుణమునకువయస్సా ప్రధానము?

విదు—నిజముచెప్పితిరి. పూవుపుట్టఁగనే తావిపుట్టునుగదా?

ద్రోణు—(తనలో) నిర్గంధకుసుమమునకు వయస్సుతో నేమి నిమిత్తము? నిర్గంధకుసుమమైననుమేలే! దుర్గంధకుసుమము

శకు—అయిన జనులనందఱి సుఖపెట్టఁగలిఁగిన రాజెవ్వఁడు కలఁడు ?

విదు—షట్చక్రవర్తులు—షోడశమహారాజులు

శకు—అసంభవము.

భీష్మ—ఇందాతని లోటేమాత్రమును లేదు.
ధృత—కురువృద్ధా! మఱెవరిది?
భీష్మ—కులవృద్ధులమైన మన యందఱిది.

[తెరలో నారదుని వీణాగానము]

విదు—ఆహా! ఏమిగానము!! నారదులు కాఁబోలును!
భీష్మ—దేవర్షి నారదులవారే తెంచుచున్నారు.
[అపుడు నారదుఁడు ప్రవేశించును. అందఱును లేచి నమస్కరింతురు]
నార—సంకల్ప సిద్ధిరస్తు
విదు—[ఆసనమునుజూపి] స్వామీ! ఆయాసనమలంకరింపుఁడు
భీష్మ—[చిఱునవ్వుతో] దేవర్షులూరక వేం చేయరు.
ధృత—మీ రాకచే మా గృహము పునీతమైనది
నార—పాండవులఁ జూచివచ్చితిని—
ధృత—[కుతూహలముతో] ఏమి నారదా! మా తమ్ముని బిడ్డలఁ జూచి వచ్చినారా!
మ॥ సుఖమే ధర్మున కర్జునుండు సుఖియే!-శోభిల్లునే కాయమే
నఖరంబై వెలుగొందుభీముఁడెపుడున్ మాద్రేయులెట్లుండ్రి? త
త్సఖియౌ ద్రౌపదికిన్సుఖంబెకద? సంతాపంబు లేకున్నె? దు
ర్ముఖులౌ నాసుతులెంత సేసిరి కడున్బన్యాంగనంగొల్వలో!
[కుశలప్రశ్న మగుచుండఁగనే దుర్యోధన దుశ్శాసన కర్ణులు వచ్చి శకుని ప్రక్కగాఁగూర్చుందురు]

**నార**—[విచారముతో సూచించుచు] రాజా! కుశలమేకాని వారన వరతశీతాతపకర్శితాంగులై పడరానిపాట్లుపడుచున్నారు.

**కర్ణు:**—[సుయోధనునితో] సఖా! వింటివా మనప్రతిపక్షుల పాట్లు

**శకు:**—[సుయోధనునితో] చూచితివా నాతంత్రముల ఫలితము.

**దుర్యో:**—[తనలో] మహానందము [ప్రకాశముగా] కన్నార చూడవలెను. వినిననేపాటి.

**నార:**—[తనలో] అంతయుద్దేశమున్నది! వృద్ధిచేయుమార్గము నేనెఱుంగనా? కానిమ్ము,

**ధృత:**—అయ్యో! పాపము!! ఏమిచేయుదును!

సీ॥ అతులని వాతసౌధముల నుండెడివారు
వనములనివసింపవలసివచ్చె
షడ్రసోపేత భోజనము సేసెడివారు
ఫలమూలములఁ దినవలసివచ్చె
పట్టువస్త్రంబులే కట్టుచుండెడివారు
వల్కలంబులు గట్టవలసివచ్చె
మృదులపూశయ్యల న్నిదురించుబిడ్డలు
బండల న్నిదురింపవలసివచ్చె

గీ॥ లలితసూత గీతములు మేల్కొందు గారు
వనమృగాలనాదమున మేల్కొనఁ వలసె
యకట! నానేరమునను బుణ్యాత్ములైన
పాండుపుత్రులు కొంచెమేని యాపదలువచ్చె 19

దుర్యో—జనకా! అట్లనెదరేల? ఇంక మీ నేరమేమున్నది? అది వారి కర్మము వారంతట లకే సృజయించఁబడిరి.

వి—ఒకరి కర్మల కొకరు కర్తలు కారు నిజమే! ఎవరికర్మ వారిని గట్టి గాచు వుచు.

ధృత—అవును గాని నాయనా! పొరబడుచున్నావు. కలిమిలేములు కావడికుండలు మారు చుండును. చూడుము.

ఉ॥ రాత్రిపోవగా దినమురాదొకో! ఆదినమేఁగఁగ రాత్రిమ్మరల్
రాతిరియేలరాదొ! అటులన్ సుఖదుఃఖములెల్ల మారునీ
రీతిని సంతసిల్లు నెడఁగష్టములబ్బును - వానిదాఁటి సం
ప్రీతులఁజేయు సౌఖ్యములు పిమ్మట - సృష్టినిమీరశక్యమే!

ద్రోణు—(తనలో) ఆహా! ఏమివేదాంతముండి. తనదాఁకవచ్చిన గాని తగవులేదు.

దుర్యో—నాయనా! అట్లని ఈనాసంపదలఁబాసి వనములలో నేనెన్నడైన క్లేశము లనుభవింపవలయు నందురా? హాహా కల.

కర్ణ—ఏమది నేనుండఁగ నీకా క్లేశములు రాజా!

దుశ్శా—సంపదలను బాయవలసిన యవసరము నీకేలనన్నా

శకు— ముమ్మూర్తికిని కూడఁదు-రాదు.

నార— నోక్కి వర్ణింపవచ్చును నీకేమి రాజాధిరాజువు

ధృ— అందఱట్లు నీకీమాట యనుభవమా యనుకదా!

నార— ఎవరికైన నమంగళములు ప్రతిహతములగుగాక!

విదు— దానికేమి నారదా! మా పాండవేయులు మాకో నేమైనఁ జెప్పుదురా ?

నార— (హాస్యముగా) యువరాజులు నాపైఁ గోపింపకుండు—

దుర్యో— ఏమి నారదా! మేమంత భాగ్యహీనులము - మావారలకు ఎగ్గు సూచించు నీ మహిమా!

నార— రాజరాజా! రాజాధిరాజులు మీరు మీరు కోపగించినను మీకు కర్ణశూలములగు మాటలు చెప్పుటకు మహాపాతకము కావలెనుగదా?

దుర్యో— తాపసోత్తమా ఎంతమాట?

కర్ణ— మీరేమి మానుషగవారా?

విదు— చూచినది గ్రహించినది వచించుటకుగాని యసత్యము వచింతురా స్వామీ!

నార— అసత్యమా? దానికవసరమేల? మఱి చెప్పవచ్చునా సుయోధన సార్వభౌమా?

ధృత— మీకు నాటకమేమి యున్నది? మా పాండవులేమనిరో

నార— రాజా యువరాజు చెప్పుమనినగాని నాకు ధైర్యము చాలదు.

దుర్యో— సందియము లేదు చెప్పుము నారదా?

నార— అట్లయిన వినుము. ధర్మజుఁడు నిన్నాఁ డందఱ ముందరఁ జెప్పుచుండిన మాటలివి.

[ "శాత్రవు సాగకు ...... భాసినుండ" అను పద్యమును చదువును]

దుర్యో— అట్లుకానిచో నిదియుకా మాయుద్దేశము.

భీష్మ— (తనలో) ఏమి యీవి ధర్మరాజుని మాటలేనా?

ద్రోణా— (తనలో) ధర్మరాజిట్లన్యాయ్యముగా మాటలాడునా?

విదుర— (తనలో) పాపము మునిమనసెంత నొచ్చినదో? లేకున్న ధర్మరాజుమీఁద నపవాదము వేయునా?

ధృత— పుణ్యాత్ములైన పాండవులకెంత యాపదవచ్చినది. పాపము.

కర్ణ— (జనాంతికముగా) సుయోధనా! ముసలిరాజు పాండవుల నింతగా పుణ్యాత్ములు పుణ్యాత్ములని రెట్టించుచున్నాఁడే నాకు చాల సంతోషముగానున్నది సుమా.

దుర్యో— నాకును గర్ణశూలములుగనున్నవి కర్ణా!

శకుని— (దుర్యోధన కర్ణులతో హాస్యముగా) నిజము వారు పుణ్యాత్ములు కారా?

ఉ. ధర్మాత్ముఁడటంచు ధర్మజుఁడు నా ముబ్బూతలూగుఁ వృకో
దరుఁడో వీరసావతారుఁడనిగాదా యట్లువీఁగుఁ బ్రభా
కరమా శౌర్యపురాశి నేనని మహాగర్వించు పార్థుండు వ

హ్వారే! పాంచాలిపతివ్రతేహాహా పుణ్యాత్ముల్ కదాయిందఱుః

దుర్యో—(నవ్వి) సెబాస్ మామా! బాగుగాచెప్పితివి వారి బాధలఁ దూర్చి మెకిఁతవిందము. కుమారుఁడుగానున్నది నారదా వారి పరిస్థితినిబట్టి యేమైన గ్రహించితివా?

నార—(తనలో) పాండవులనిన నీరికింత ద్వేషమునున్నదిగా ఈ గుస గుసలకు దగినట్లు సమాధానము చెప్పవలెను. (ప్రకాశముగా) కుమారా! పాండవులనిన నంతటిసి వేఁడుఁ దగినవారు కారు. నేను వారినిజూచి గ్రహించినది నీవొక్క రుఁడవేకాను. ఇక్కడివారందఱుఁగవలసినదే మీామీ లునకే చెప్పుచున్నాను. వినుఁడు.

సీ॥ ఎవరిపాపము వారిదే కాన కష్టుల
మడియింపఁజూచు ధర్మసమవర్తి.
కౌరవకాసార కమలనాళంబులఁ
బెకలించి తినఁజూచు భీమగజము.
కురుకూపము ప్రతాపసిరులచే నికింప
నుంకెగాయర్జున చండకరుఁడు.
కౌరవకాంతార ఘనతరుల దహింపఁ
జూచెడిద్రౌపదీ శోకవహ్ని.
అవనిఁ బాతుకపోవు కౌరవులమూల
ములను మొదలంటఁ ద్రవ్వఁ కులమహాశి
బాధపెట్టినవారిపై పగనుబూని
చంపితీరును సహదేవ సర్పరాజు.

కర్ణ—ఏమి! కొంచెముచనవిచ్చిన హద్దుమీరుచున్న దే!
ద్రోణు—హద్దుమీరినది దేవర్షియా నీవా ?
కర్ణ—కులాభిమానము పోనిచ్చుకొనలేవుగా!
విదు—అడిగినదానికి వారుత్తరమిచ్చుచుండ మధ్యనిన్నెవ్వరడ్డు మనిరి సూతపుత్రా!
కర్ణ—దాసీపుత్రా! చూచినదిచెప్పక మధ్య నీవ్యాఖ్యలేల?
నాద—అడిగితిరిగాన చూచినది చెప్పవలెనా భీముఁడీమాటల నుచుండగా చెవులార విన్నాను కన్నారఁ జూచినాను.
[అన్న నిర్బంధమేమి......భుజింపనొక్కొ—మఱియు ఎప్పుడు ద్వాదశాబ్దముల......వేడిరక్తముల్—పద్యమును చదివి] ఇఁక నర్జునకు నీవొకలెక్కయా! ఆతండ—
దుర్యో—నారదా! అంతటితో వారి ప్రగల్భములు చాలునయ్యా!
నార—అడిగితివిగాన చెప్పితిని నాకేల? మీకు నేనేమి విరోధినా సుయోధనా ?
ధృత—(భయముతో) స్వామీ! భీముఁడట్టివాఁడేయగును
మ॥ తెలియన్నేరనివారునాసుతులు సుంతేనిన్ కటా! అర్జునా నిలమేపారుచు భీమునాగ్రహదవాగ్నిన్ రేఁపగారేఁగి సా బల రాధేయ యుతంబుగా పరగునస్మత్పుత్రకాంతారముల్ గులనాశంబుగఁగాల్పదే! ఇడుమనాకుంగల్గెనియీమునన్.
దుర్యో—(రోషముతో)

తు॥ జనకా ! ఏటికిట్టులాడెదరు ? తేజంబున్నవారైన ధా
త్రిని వీరత్వముచే జయించి పరిపాలింపన్వలెంగాని దొం
గను దేల్లుటినయట్లు సేయనగునే ? క్రొల్లంటితోఁగూడి కా
ననమందుఁ వసియింపఁబోవుదురే? మానంబున్న కౌలీనులే?
ఇంతకును దూరపుకొండలు నునుపనుసాముత వృధగాదుగదా?

ధృత—అట్లనకుము నాయనా ? వారందఱును ధర్మపాశబద్ధు
లు కానిచో......ఏమిచెప్పను ?

భీష్మ—ధర్మజుఁడు కేవలము ధర్మమూర్తియే !కాని నాఁడు
మనమందఱ మేమైయుందుమో !

ధృత—భీముఁడో వీరరసావతారము.

విదు—అర్జునుఁడు పరాక్రమరాశియే!

కర్ణ—హాహ్హాహ్హా! హాహ్హాహ్హా! ఈరాజులందఱు భటాగ్రజులై
నారే ?

సీ॥ హక్కులేనట్టిరాజ్యంబులోఁ బాల్గొనం
బూనునాతఁడు ధర్మమూర్తియగును
కోఁతివాలంబునుగూడ నెత్తఁగలేని
భీముండు వీరాధివీరుఁడగును
దొంగదోపున సుభద్రాంగనం గొంపోవు
ధీరుఁడర్జునుఁడు బల్ శూరుఁడగును
ఐదుగురం బెండ్లియాడి బిడ్డలఁగన్న
ద్రౌపదీమణి పతివ్రతయె యగును

ఇంక మిగిలిననిద్దఱు నెందుఁ జెంద
రయ్యొ ! పాపము ! వారిద్దఱడవిపాలె !
నకులనామమందు ప్రథముండు నకులమగును
కడపు సహదేవమొలకయు నడవిపాలె !

ధృత—సూతనందనా నీవాచాకౌటిల్య మంతటితోఁ జాలింపుము.

భీష్మ—(నిరసనముగా) ఆతనితో నీకేమయ్యా ?

సీ॥ రాజవీథిని యిభ రాజమేఁగుచునుండఁ
గుక్క మొఱిఁగిన నేమి లెక్క సేయు ?
శాఖాగ్రమునఁ గోఁతి చరియించినను గ్రింద
నున్న సింగము కేమి వన్నె తగ్గు ?
కూళ యెంతగఁ దాను గొట్టుమిట్టాడినఁ
బుణ్యాత్మునకు నేమి పోవునొక్క ?
తుంటరులు మేటిపెద్దలఁ దూలనాడ
వారలకుగల్గులోటేమి వసుధలోన ?—
వసుధలోనన గాదలస్వర్గమందు
నైన లోటేమికల్గునో యాంబికేయ ? 26

వార—వారందులకే యుపేక్ష సేయుచుండిరి.

విదు—పాపము ! పుణ్యాత్ములనిన వారేకదా !

ధృత—అట్టి పుణ్యాత్ములకగ్రజుఁడే ! ధర్మావతారమే ! ఆతఁడే ని తమ్ముల దారింపలేదా మునివరా ?

నార—రాజా ! అతనినీవట్లు సందేహింప నవసరము లేదు

భీష్మ—నిజమే !

చం॥ కరియగు భీమునోపమును గట్టఁగశృంఖలమై-కిరీటిభా
స్కర కరతాపమాపఁదగు చల్లనిమబ్బయి-కృష్ణశోక వ
హ్నికి రగులఁనీని నీరమయి-హీరముబోల్న కులాసిపాలిదా
రొయటయయి-త్రాచుపామునఁగనొప్పెడియాసహాదేవుపాలిటీ
శ్వరయను వేరునై-భరతసంతతిఁగాచును ధర్మమూర్తియే ?

ధృత—అగునగును మాధర్మనందనుఁడే నాబిడ్డల కాయువు
పోయుచున్నాఁడు.

దుర్యో—ఏమినాయనా ! ముదిమిచేఁ దలతిరిగిన గాంగేయుని
తో బాటు నీకును—

దుశ్శా—ఒకానొకసన్యాసి రాజాధిరాజులమగు మాకు నా
యువుపోయుటా ?

దుర్యో—పరులహీనతకంటెను మాయదృష్ట మింత విషమా
మెనా ?

దుశ్శా—ఎంతదుస్సహమగుమాటలు !

శకుని—అందఱుఁ బాండవపక్షపాతులే !

కర్ణ—ఇటువంటిచోట మనముండఁదగదు.

దుశ్శా—రండు పోదము.

దుర్యో—ఆసన్యాసులచేతనే నేల యేలించుకొనుఁడు.

[దుష్ట చతుష్టయము నిష్క్రమించును.]

ధృత:—నాయనా! కోపగించెదవేమి? నేను గ్రుడ్డి నైనంత మాత్రమునఁ బౌరుషహీనుఁడనా? నాసుతుల సంపదఁ జూడలేని యీర్ష్యాళువునా? క్షత్రియుఁడఁగానా? అట్టి నేనే భయపడుచున్నాను. దేనికి?

కం॥ జంకను ధర్మజునకు నే
జంకను ఫల్గుణుని బాహుశక్తికి నైనన్
జంక నిఁక నేరికైనన్
జంకొదవు న్వాయుసుత గదాబన నేలో!

తెర పడును.

---

## నాల్గవ రంగము

[ప్రదేశము:—దుర్యోధనుని ఆలోచనామందిరము. ప్రవేశము:—పాన్పుపై విచారించుచున్న దుర్యోధనుఁడు, చెరియొక వైపున ఓదార్చుచు కర్ణశకునులు.]

దుర్యో:—(రోషముతో)

మ॥ నను దిట్టందగువాఁడె తండ్రి అటుల న్నన్నిట్ట నే కోపమం
దను రవ్వంతయుఁగాని నాయెముటఁ బ్రత్యర్థుల్మహాశూరులం
చును సాధింపఁగలేని యోధవరులంచు న్మంచిపుణ్యాత్ములం
చును నేఁ వదరంగ రౌద్రమొదవున్ శూరత్వమేపారగా.

కర్ణు:—హితుల దూషించినను సహింపనగును గాని విరోధులఁ బొగడినచో నా పాదమస్తము భగ్గుమనును.

శకు:—అగును సహజమే! పౌరుషవంతులకు.

దుర్యో:—మామా! అట్టి పౌరుషవంతులమే. మన కౌఱకేల నీరాజింత భీతుఁడు గావలయును?

కర్ణు:—మన పౌరుషమును జేవయుఁ జూపకుండుటచేత నే!

దుర్యో:—అవకాశము చిక్కనగదా!

శకు:—కల్పించుకొనవలెను.

దుర్యో:—ఎట్లు?

శకు:—మాయచేత- తంత్రముచేత.

దుర్యో:—మామా! ఒక్కమాట వినుము. పాండవుల హింసించుటయందు మనము పన్నిన మాయలు, కల్పించిన తంత్రములు, వృథా వృథా!

కర్ణు:—అగునగును. నీటఁద్రోసిన- విషముపెట్టిన-

దుర్యో:—లాక్షాగృహదాహంబుననో?

శకు:—అంతమాత్రమున నిరుత్సాహమా? నెగ్గిన జూదపు మాటయో!

దుర్యో:—ఆలోచింపఁ దగినదే!

కర్ణు:—నాఁటినుండియే విదురాదులు పాండవపక్షు లయినారు.

శకు:—అయిన?

కర్ణు:—ఏమన్నను మాయు విక్రమమునకు సరికాదు.

శకు:—వారునూత్రమంత సులభసాధ్యులా?

దుర్యో:—కారు. కష్టసాధ్యులే!

కర్ణు:—ఎట్లయిన సాధ్యులు గదా?

దుర్యో:—ఇంతకు నేమనెదరు?

కర్ణు:—ఇప్పుడు పాండవు లున్న చోటికిఁ బోవలయును.

శకు:—పోయి?

దుర్యో:—వారి నుడికించుటయే

శకు:—ఎట్లు?

కర్ణు:—అంతపని మన మేలచేయవలెను? ధర్మసముయమధ్యా హ్నమార్తాండుని రీతి సకల సామ్రాజ్యవైభవముల మెఱయు నిన్నుఁ జూఁచినంతనే వారే హృదయభేదం బుగా వగచెదరు.

శకు:—సెహబాస్! ఇది నాకును సమ్మతమే. నచ్చినది.

కర్ణు:—రాజా! మిత్రజనమోదమును శత్రుజనఖేదమును కంటె సంపదలు కలిగియు ఫలమేమి?

శకు:—ధనధాన్యపుత్రబాంధవజనలాభము లెవ్వియు దీనికి సరిగావు.

ఉ॥ ద్వైతవనాన నీచమగు వల్కలము ల్ధరియించియెట్టనో,
జేతికిఁ జిక్కు దుంపల భుజించి కృశించి నశింపనున్న నీ

జ్ఞాతులఁ జాలవందురినజ్ఞాతుల నుజ్జ్వలరాజ్యవైభవో
పేతులమై కనుంగొనెడి వేడుక చాలదె కౌరవేశ్వరా !

కర్ణు:—అదిగాక మఱొకవిషయము !

చం॥ అతులితభాగ్యభోగసముదంచిత శ్రీవిలసిల్లు నట్టి నీ
సతులనుజూఁచి ద్రౌపది విచారముచేఁ గడునీర్ష్యనంది దుః
ర్మతిఁ దనుదాన దిట్టుకొని బ్రహ్మనుదిట్టుచు నాత్మలోన నీ
సతియగు భాగ్యమబ్బమికిఁ జాలకృశింపదె కౌరవేశ్వరా !

దుర్యో:—నిజమే.

శా॥ నాయుద్దేశమదే సుఁడీ! అయిన విన్నార్గాదె నేఁడల్ల కౌం
తేయుల్ ద్వైతవనాన నుండిరనుచున్ దేవర్షి చెప్పంగ రా
ధేయా! అందున నాంబికేయుఁడును సందేహించిపోనీయఁడే
మో యంచున్నదిదోఁచెడిన్విదురభీష్ముల్ గూడ వారింపఁగా.

కర్ణు:—సఖా ! నీవు ప్రాయమునకు వచ్చిన వాఁడవు.

శకుని:—సుక్షత్రియుఁడవు.

కర్ణు:—నిరంకుశాధికారిగ నుండఁదగినవాఁడవు.

శా॥ ఇంద్రప్రస్థపురాన ధర్మజునిదై యొప్పారు శ్రీనందుచుం
గేంద్రంబై కరిపట్టణంబలరఁగా గీర్తిన్విరాజిల్లు నీ
కుంద్రవ్యంబిడి భక్తిమై సకల దిక్క్షోణీశులుం గొల్వ నా
కేంద్రుం డాసురలోక మేలునటు లీవీ భూమిఁబాలింపుమా!

ఏమి శకునిమామా!

శకు:—అగును.

ఉ॥ పౌరులు రాజులున్మిత్రులు బంధులు నీదగు శ్రేయమెప్పుడుం
గోరుచునుండఁగా ధర నకుంఠితమార్గము వట్టియేలుమా!
గౌరవనాథ! నీవు కడుగౌరవనాథుఁడవై చెలంగుమా
భూరిప్రభన్ ప్రభాకరుని పోలికనంచుచు నో సుయోధనా!

దుర్యో:—అదియే యోజింపవలెను (సందేహముగా) కానీ.

కర్ణు:—(సంతోషముగా) లేకున్న చో-

మ॥ అవనీపాలక! నాకుదోఁచిన యుపాయంబొక్కటేయుష్టుద్వై
తవనంబందున గోవులున్నవికదా ధాత్రీశునొప్పించి ధే
నువులం జూఁచునెపానఁ బోఁగలము కర్ణుండుండ నీకేటిజం
కు విరించ్యాదులకేని జంకకుము సంకోచింపకో భూపతీ!

శకు:—(తొందరగా) నాకు నిదే యుపాయము దోఁచినది.
నేను సుఖప్రదమనుకొనుచుండఁ గర్ణుఁడు ముందై నాఁడు.

దుర్యో:—(సందేహముగా) ఘోషయాత్రకా (ఆలోచించి
తలయూఁచి)

చం॥ ఇదికడు లెస్స! ఐన ధరణీశుఁడు విన్నను భీష్మద్రోణులు
న్విదురుఁడుఁ జెట్టయౌనను చు పెక్కు అమంగళముల్వచించి య
డ్డునుకు రవంత యేన్పయికినుల్లినఁ గావున దంత్రమందునం
గుసుగుస మాటలాడఁదగు గోడలకుం జెవులుండు మిత్రమా!

## సుయోధన శృంగభంగము

అపుడు జూదమునాఁడు జరిగిన విషయము

చం॥ మఱచితివేమొ! నిన్ను నను మామను నెంతగ నాడిపోసిరో
యెఱుఁగవె? అందుచే విదురుఁడేమనునో యనుశంక కానియీ
తెఱఁగున శత్రుఖేదమునఁ దీఱనిమోదము నందుకన్న నీ
సిరి ధర రాజ్యముల్ సరకుచేతునె? లెక్కయె? అంగభూపతీ!

కానిమ్ము కానున్నది కాకమానదు.

కర్ణు:—(లేచి) సఖా! మామా! కొల్వునకు నడచుచుండుఁడు. నేను గోపాలుని తయారొనరించి మీవెంటనే-

శకు:—సమంగిముని -

కర్ణు:—అగును మామా! (నిష్క్రమించును.)

దుర్యో:—ఎవరాముని? ఎందులకు?

శకు:—మునికాదు.

దుర్యో:—మఱి?

శకు:—ద్వైతవనగోపాలకుఁడు. "గోవ్రలకు దుష్టమృగబాధ యెక్కుడుగనున్నద"ని రాజుచెంతఁ జెప్పునట్లుగాఁ జెప్పించుటకు.

దుర్యో:—మామా! మీ యాలోచనము లేమియాలోచనములయ్యా! బృహస్పతిని జంపి పుట్టినారే!

శకు:—మిత్రుఁడన్న కర్ణుఁడే మిత్రుఁడు సుమీ!

దుర్యో:—బంధుగుఁడన్న నీవే బంధుగుఁడవుసుమా!

శకు:—నామేనల్లుఁడవు. నిన్నుఁ జక్కపెట్టుట నావిధి.

దుర్యో:—నీదయ.

శకు:—(లేచి) లెమ్ము పోదము కొల్వునకు.

దుర్యో:—కర్ణుఁడు చేయఁబోయిన పని ఈసరికగునా?

శకు:—ఈలోపున మనము నారదుని మనపక్షమునకుఁ ద్రిప్పు కొనవలయును.

దుర్యో:—ఔను. మనపని సులభముగ నెఱవేరఁగలదు. మం చిది పోదము రమ్ము.

[ఇరువురును నిష్క్రమించుచుండగా]

తెర పడును.

## ఐదవ రంగము

[ప్రదేశము:- కురురాజుకొల్వు. ప్రవేశము:-ధృతరాష్ట్రుఁడు, దుష్టచతుష్టయము, భీష్ముఁడు, విదురుఁడు, నారదుఁడు మొదలగువారు.]

దుర్యో:—తండ్రీ! ఇఁక రాజధర్మములు నుడువుఁడు.

నార:—(తనలో) ఏమి యీతనివిద్యార్థిత్వము! ఏమివినయము!

ధృత:—ఇదిగో నాయనా వినుము.

సీ॥ కష్టసుఖములెల్లఁ గనుపట్టి ప్రజలను
గన్నబిడ్డల రీతిఁ గావవలయుఁ
గార్యతంత్రంబులఁ గడపుచో మంత్రుల
నైనఁ గ్రీగంటితోఁ గానవలయుఁ

బగలైనఁ బైపైకిఁ బాగులనీయక రాజ్య
మర్మంబుల గ్రహించి మసలవలయుఁ
బహువుల జనముల బాధించు వన్యమృ
గాల వేఁటాడి భూమేలవలయు

గీ॥ నేలుబడిలోని రాజ్యతంత్రాల నాడు
వారి సలహాల గైకొన వలవదెపుడు
వ్యసనముల కెన్న డేని శానిసలుగాక
మంచిచే "మహారాజ"ని పించుకొనఁగ.

దుర్యో:—చిత్తము.

నార:—(తనలో) ప్రకృతోపయోగమును గనుపట్టియే పలికింపుచున్నాఁడు జగన్నాథుఁడు.

ధృత:—కర్ణా ! సేవాధర్మముఁ జెప్పెద నాకర్ణింపుము.

కర్ణు:—చిత్తము దేవా !

ప్రతీహారి:—(ప్రవేశించి) దేవా ! ద్వారము కడ నెవఁడో గోపాలుఁడు దేవరదర్శనమునకై.

ధృత:—ఎవరాఁతఁడు?

విదు:—ప్రవేశపెట్టుము.

[ప్రతీహారి నిష్క్రమించును. సమాగముఁడు ప్రవేశించును.]

శకు:—ఓరీ నీవా !

ధృత:—ఎవ రాతఁడు ?

శకు:—అతఁడా! ద్వైతవనంబునందులకీలారంబుననుండి వచ్చిన గోపాలుఁడు.

సమం:—మారాజు లందఱికి దణ్ణాలుండిబాబయ్య !

ధృత:—ఓరీ గోపాలా ! మన గోవులన్నియు క్షేమముగా నున్నవా ?

సమం:—ఏం సెప్పేదేలికా !

ఉత్సాహ॥ దొయితవోనఁవు లాటిపోయి దూడలకును లేదయా
అయితెనేం మెకాలుబాయి ఆటికాయలేం దొరా !
బయముయేసినాది బాబు పాఱివొచ్చినా దొరా !
దయకటాచ్చ ముంచి యేగ దండుపంపుమావొరా!

కర్ణ:—కం॥ దేవా ! అట్లయిన న్మన
గోవుల హింసించునట్టి క్రూరమృగములన్
గావించి చంప వేఁటకు
దేవరపుత్త్రుని పనుపఁగ దే సత్వరమే.

ధృత:—అవును నిజమే.

కం॥ తగు గోరక్షకుసై వన
మృగవిధ్వంసంబుచేయ యేఁగుట యైనన్
రగులుకొను పాండుసుతులు మొ
లఁగెదు నటకు నేఁగగా తలఁపకుఁడయ్యా ?

శకు:—

శా॥ బావా! పాండుకుమారులంగనఁగ పోవంగోరుచున్నారమే?
గోవారంబునుగాంచి సేమమరయం గొన్నాళ్లు వేఁటాడుచుం

దేవి ప్రశాంతిని గైకొనక వెడలనర్థింపంగ నీపల్కులా ?
భావంబందున నేదొ వెట్టుకొనుచుంక బైకిట్లు మాటాడుదే.

కర్ణు:—రాజులకు వేటాడుట ధర్మముకాదా దేవా !

నార:—ఇప్పుడు మీరు సెలవిచ్చిన రాజనీతిలోని ధర్మమేకద యిది మహారాజా !

ధృత:—వేటాడుట రాజధర్మము కాదనను. కాని పాండవు లున్నచోటికిపోవుట మేలు కాదనుచున్నాను.

భీష్మ:—నాతలంపును నట్టిదే.

విదు:—నాయుద్దేశమునదే. ముందు వీరిచే పరిభవింపఁబడిన పాండవులు వీరు మరలనందులకే వచ్చియున్నారని యాగ్రహింపకమానరు.

భీష్మ:—వీరు వారిని నిగ్రహింపలేరు.

విదు:—ఏల దలమించెడి వారిఁదాకఁదలఁచుట ?

ధృత:—అగుచునాయనా ఆమాటయు నిజమే ! ఎవ్వరర్జునున కీడు, ఎవ్వఁడు భీమునకుజోడు ?

భీష్మ:—పైగా వారు దేవప్రసాదితాస్త్రులు. పుణ్యాంగన ద్రౌప-

దుర్యో:—(రోషముతో) పుణ్యాంగనయో-పణ్యాంగనయో-మమ్మెఱుఁగరా వారినెఱుఁగరా?

చం॥ కదనముసేయఁ దమ్ములును గర్ణుఁడు నేనును నిల్వగా నెవం
డెదురగలండు మమ్ములను ? ఎందులకింతగభీతి తండ్రి ! ద్రౌ

పడి నటుభంగపుచ్చినను పౌరుషహీనులు వారు ప్రాకుల
ట్లొదుగుట నెంచరే! అయిననూరక యెంకులకా ప్రసంగముల్.

శకు:—(దుర్యోధనుని కనుసన్న చేవారించి) అది కాదు బావా!

ధృత:—ఏది కాదు శకునీ! తప్పక అయితీరును.

గీ॥ వీరారు వారికిఁ గీడెంచువారె నిజము
వారు మిమ్ము నుపేక్షించువారు కారు
ధేనురక్షణమే తప్పదేని యిపుడె
తగినవారిని బంపిన సగును మేలు.

శకు:—

ఉ॥ బావ! ఇదేటిమాట మనపాండుకుమారుల శక్తియుక్తులన్
భావనసేయుమే? ఎటుల వారలకొగ్గనలంతుమయ్య? మే
మావిధిఁ జేతుమే యనుము న్యాయముదప్పనె ధర్మరాజు? ఆ
యేవ్వరు నంతియేగద మహేలను హానితలంపు లింతగా?

కర్ణు:—ఆనాఁడాధర్మరాజొనర్చిన ప్రతిజ్ఞలయిన జ్ఞాపకము
లేవా రాజా!

శకుని:—రవంత యోజించుకొనుఁడు.

ధృత:—ఏమో నాకేమియు నచ్చుటలేదు.

భీష్మ:—కుమారా! నాకీఘోషయాత్ర యేమాత్రము నమ్మ
తముకాదు. ఏమందువా?

ఉ॥ నారలుగట్టినారని వనంబుల జంతులరీతి వాసము
న్నారని ఆకలంబు లశనంబని హేళనఁ జేయుచుండరే

వీరలు వారి నందునను వీరికి వారికిఁ గయ్యమబ్బకే
తీరదు కానఁ బోఁదగదు తెల్పితి నీదయ మీఁద శ్రీపతీ!

శకు:—ఏల! లేనిపోని శంకలు.

భీష్మ:—శంకలు దీర్చు శకుని బయలుదేరినాఁడే.

శకు:—భీష్ములవారి భీష్మింపులముందర శకునిశంకలు దీర్చు టెంత?

ధృత:—శకునీ! యేల పెద్దవారితోఁ దగనిమాటలు.

కర్ణు:—ప్రకృత మాలోచింపుము మామా!

శకు:—బావా! మేము పాండవులకు హానితలంతుమని గదా మీయూహ.

ధృత:—అంతమాత్రమే కాదు, హానిఘటింతురని ..

శకు:—ఒక్కటేమాట ఇదిగో వినుఁడు.

గీ॥ వారు నివశించుచోటి కెవ్వారినైనఁ
బోవనీయముమనవారిఁ బోవ మేము;
వారు మముఁజూడవచ్చినఁ బల్కు మతిగ
చాలునా? ఇంక నేమైన సలుపవలెన?

ధృత:—ఏమి నారదా!

నార:—అవశ్యము వెళ్లవలసినదే! వీరికీ రికూడ వెల్లడికాఁగలదు.

దుర్యో:—జనకా!

గీ॥ మాకుఁ బాడమెడి కడుమృగయా కుతూహ
లంబు, నేఁడు గోగణరక్షణంబు వలయుఁ

బనులు రెండొక్క కార్యానఁ బదిలపడును
గీము మూడెమునని యెను గోడదేల ?

నార:—లోకమున కొకపాఠమును నేర్పినవారగుకురురాజా !
పోవ సెలవిమ్ము.

ధృత:—(ఆలోచించుచు) అట్లయిన బుద్ధిమంతులరై గోగణము
నరసి తడయకరండు పొండు.

దుర్యో:—చిత్తము.

తెర పడును.





### సు యో ధ న

# శృంగభంగము

## రెండవ అంకము

### తొలి రంగము

[ప్రదేశము:- ఘోషయాత్రామార్గమధ్యమునఁ గరిపురమునకుఁ గవ్యూతిమాత్రదూరమున వేయఁబడిన దుర్యోధనునిశిబిరము. అందు అంతఃపురము. ప్రవేశము:—సల్లాపము లాడు కొనుచుండిన భానుమతీసుయోధనులు.]

భానుమతి:—నాథా! మీయభిప్రాయమేమో నాకర్థమగుట లేదు.

సీ॥ గోరక్షశీఘ్రూనఁ గోరుటతగుఁగాక
లీలసిచ్చట మజిలీ యిదేల?
వేఁట కుచితంబైన వేషభాషలుగాక
పెండ్లికో యన తర్లి వెళ్లుటేల?
వేఁటకుఁ దగినట్టి విల్లమ్ము లవిగాక
దండుతోఁ జను నీవిధానమేల?

ఆరితేరిన మృగయాకోవిదుల్గాక
తరుణీజనంబుతోఁ దరలుటేల ?

గీ॥ యాత్రకో ! దండయాత్రకో యరుగుటిపుడు
పెండ్లియూశించి యిటు బయల్వెడలినారొ !
వనవిహారముసేయఁగా వచ్చినారొ !
గోవులను గాయ వేఁటకుఁ బోవుటేడ ?

దుర్యో:—దేవి ! చక్కఁగ గ్రహించినావు.

భాను:—ఏమి గ్రహించితిని ?

దుర్యో:—ఇప్పట్టున ననువగులీల యిదియే !

భాను:—ఎట్లు ?

దుర్యో:—ఈపరిజనంబులతో నిట్లరుదెంచినందులకు పెండ్లికన్న నెక్కువ శుభావహమగు మోద మొందఁగలము.

భాను:—దేవా ! నాకేమియుఁ దెలియుటలేదు.

దుర్యో:—(ఉత్సాహముతో)

శా॥ దేవి! నీకడదాచుటెందులకు? కౌంతేయుల్మదైశ్వర్యముఁ
దీవింగాంచి యసూయతో వగవ నిన్వీక్షించి నిశ్శ్రీకినై
భావంబందున వారికాంత మెరియన్ భాసిల్ల నీరీతిగా
బోవం గారణ మెల్లి ద్వైతవనిలోఁ బొందంగనాహ్లాదమున్.

భాను:—ఆర్యా ! ఏమి యీసాహసము !

దుర్యో:—సాహసమా ?

భాను:—మీవంటివా రిట్టిపని చేయఁబూనుట సాహసము కాదా మఱి?

దుర్యో:—ఇట్టి స్వల్పకార్యమునకు నావంటిఘను లెంకుల కనియా నీయభిప్రాయము. దేవీ! వారిఖేదమును హృదయామోదముగ ననుభవించుటకు మన సామంతులఁ బంపినచో నది యసంగతము కాదా?

భాను:—మనోహరా! ఇయ్యది మీరు స్వయముగఁ బ్రయత్నించిననూ అసంగతమే! అసమంజసమే! అసాధ్యమే!

దుర్యో:—ఆ! ఏమది?

భాను:—మీరుకాదు. మీకన్న సురేంద్రుఁడు ప్రయత్నించి చేయఁబూనినను నంతియే!

దుర్యో:—ఏమిదేవీ యట్లనియెదవు?

భాను:—ఏమా? పాండవులనింకను మీరు గ్రహింపలేదా?

ఏల నీ వెఱ్ఱిప్రయత్నములు!

గీ॥ విషము వెట్టించి, త్రోయించి విషములోన,
లక్కయింటను గాల్పదలంచిరట్లు,
కాని వారల నొప్పింపఁ గలిగిరొక్కొ?
ఎందులకు కానిపని జేయ నీతలఁపులు
గాలిలో మేడలంగట్టు కరణి నాథ!

దుర్యో:—ఔరా! నావంటి సార్వభౌమునకుఁ బట్టమహిషివై ఏల నిట్లు ప్రేలెదవే! నీవా నాకు ధర్మపన్నము లుప

దేశించుదానవు. అంత ధర్మాత్ముడవైనచో గావలెనన్న
పోయి ధర్మజు— [శకుని ప్రవేశించును.]

శకు:—ఏమాత్రమిందర సుయోధనా! అమ్మాయీ! ఆడువారు
రాజ్యవ్యవహారములలో కలుగఁజేసికొనఁగూడదు; నీ
యభ్యంతరమందిరమునకు నీవిఁక బొమ్ము.

[భానుమతి చిరునగవుతో నిష్క్రమించును.]

దుర్యో:—మామా! కర్ణుఁడేఁడీ?

శకు:—అతఁడును వచ్చుచున్నాఁడు. [కర్ణుఁడు ప్రవేశించును.]

కర్ణు:—దుర్యోధనసార్వభౌముల కభివాదనములు.

దుర్యో:—సఖా! మాదేవిగారి యుపన్యాసము నీకును వినఁ
బడియే యుండునని దలంచెదను.

కర్ణు:—చిత్తము.

శకు:—ఆమెకు నారదుఁడు పిడికిమందు వైచినాఁడు.

దుర్యో:—ఆ! అట్లు చెప్పుడు.. లేకున్న -

శకు:—దానిమాట కేమి? ప్రకృత మాలోచింపుఁడు.

కర్ణు:—కార్యక్రమప్రణాళిక నేర్పఱచుకొనవలయును.

దుర్యో:—మీయుద్దేశ మేమి?

శకు:—పట్టిక తయారొనరించుచుంటి!

దుర్యో:—ప్రతిపక్షులగుండెలు పగిలిపోవునట్లుండవలెను.

కర్ణు:—ప్రతిదినము ప్రత్యూషమున వనము ప్రతిధ్వనించునట్లు
తూర్యరావములు మ్రోయింపించుట మొదటిపని.

దుర్యో:—నిద్రనుండి వా రేడ్చుచు, మనమునవ్వుచు లేచుటకు-

శకు:—ఇట్లే పగలంతయు నేడ్చుచు వారు, నవ్వుచు మనము, కాలము బుత్తుమో యను నట్లుండవలెను రావము.

దుర్యో:—ఇఁక రెండవవిషయము!

శకు:—సార్వభౌమ సంకీర్తనము.

కర్ణు:—వందివైతాళికగాయకుల చేత, వారిచెవులు చిల్లులు పడునట్లు-

దుర్యో:—మూఁడవది-

కర్ణు:—ఊరేగింపు టుత్సవము.

దుర్యో:—ఇది వనముకదా? ఊరేగుటెట్లు? ఊరైనకదా ఊరేగుట.

శకు:—నీవు మెట్టినదెల్ల నూరేయగును!

దుర్యో:—అయినఁ బాండవులకుఁ బాట్లో!

కర్ణు:—రాజా! ఇది మనకే యూరు. వారి కడవియే!

శకు:—ఇచ్చటనున్న రోజులన్నియుఁ బ్రతియుదయముననూ నూరేగవలయును.

కర్ణు:—సాయంత్రమునఁ గూడ- మేళతాళములతో నేనుఁగుపై వనమంతయు-

శకు:—అవసరములేదు. పాండవుల యాశ్రమము చుట్టును మాత్రమే తిరిగినఁజాలును.

దుర్యో:—పదిమారులు తిరుగవచ్చును. వనమంతయు నెందులకు?

కర్ణు:—నీకు చెరియొక వైపునను గుఱ్ఱములపై నేనును దుశ్శాసనుఁడును.

శకు:—ఏనుఁగుపై నీప్రక్కగా నేనునుండవలయును.

దుర్యో:—మంత్రులు సంగరక్షకులును- భేష్! బాగున్నది.

కర్ణు:—వనరాజా!

దుర్యో:—సింహమునా?

కర్ణు:—పాండవ మత్తేభములపాలిటి సింహమవు.

శకు:—మాకుమాత్రము చల్లనిరాజవు.

కర్ణు:—నీ వేనుఁగుపై నెక్కి యూరేగునట్లు శిలాప్రతిమలు వ్రాయించి-

శకు:—పాండవులు తఱచుపోవు ప్రదేశములందు నిల్పవలయును.

కర్ణు:—నీప్రశస్తి శిలాస్తంభములపై వ్రాయింపవలెను.

దుర్యో:—అందందుఁ గ్రీడాభవనంబులఁ గూడఁ గట్టింతము.

శకు:—అందలి కుడ్యములపై నీవిహారములు, నీప్రశస్తి, నీచిత్రములు చిత్రింపించవలెను.

దుర్యో:—ఆనీచులు కనుపించినను జూడనియట్లు నటింప-

శకు:—నటించుటేల! చూఁచియు మాటలాడరాదు.

కర్ణు:—పలుకరించినను మాటాడఁగూడదు.

శకు:—నీదేవి నలంకరింపఁజేసి పూవులపల్లకిపై-

కర్ణు:—పంచభర్తృక దృష్టియందే పలుమారులు పడునట్లు-

శకు:—ఊరేగింపవలెను.

ర్ణు:—మన వంటవస్తు సంభారముల ఘుమ ఘుమ వారి ప్రాణములఁ దీయునట్లుండవలెను.

శకు:—ప్రతివిషయమునను "నిట్టిసౌభాగ్యము మనకులేదే" యని వారేడ్చునట్లుండవలెను.

కర్ణు:—నీతాంబూలపు పరిమళము ద్రౌపది మనస్సు పాడు చేయవలెను.

దుర్యో:—ఇంతచేసినను వారు వగచెదరో! వగవరో!

శకు:—సందేహమేల? తప్పక వగచెదరు.

గీ॥ తమకు సంపదలేని దుఃఖమును మించి
పరులు తులలేనియట్టి సంపదల తోడ
వెలుఁగుచున్నార లనునట్టి వెత దహింప
నెవఁడు జీవింపగల్గు నీభువిని? రాజ!

కర్ణు:—వగనుటేకాదు. వారుచచ్చినంత పనియగును. ఈవైభవములు, ఈభోగములు, ఈసంపదలు చూచి ద్రౌపది సహించునా, యజ్ఞసేనుఁడు బ్రతుకునా?

దుర్యో:—ఇద్దఱును జత్తురు.

శకు:—వారికై ధర్మజుఁడు దాఁటీయును.

దుర్యో:—భీముఁడో వారిననుసరింపఁగలఁడు.

శకు:—ఇఁకఁగవలుండియేమి? ఊడియేమి?

దుర్యో:—(సంతోషముతో) హాహాహా! భూమి అపాండవము. హాహాహా!

కర్ణు:—అర్జునునితోఁ బోరుట కవకాశములేని నాయీబాహు వీర్యమేల ?

దుర్యో:—భీముఁడు లేకున్న నాపగతీరు టెట్లు ?

శకు:—అందఱును బాగుండవలెను. వారుబ్రదికియే మరణ వేదన ననుభవింపవలెను.

దుర్యో:—అదియే మనమోదము. రండులోనికిపోయి యింకను నాలోచింతము (లేచుచుండగా)

తెర పడును.

---

## రెండవ రంగము

[ప్రదేశము:—కౌరవుల గోవులున్న ద్వైతవనభాగము. దుర్యోధనుని శిబిరమునకు ముందున్న స్థలము; ప్రవేశము:—పర్పరచిన గద్దెపై పీఠచతుష్టయము. చుట్టునున్న రత్నకంబళములపై గాయకనర్తకవందివైతాళికాది జనులు. నర్తకి యాడుచుండును. దుర్యోధనుఁడు సత్కరించును.]

కర్ణు:—ఇఁక సంగీతము.

[గాయకులుపాడఁగా దుర్యోధనుఁడు సత్కరించును.]

శకు:—ఏదీ మన మహారాజప్రశస్తి.

కర్ణు:—ఆస్థానకవులు రచించిన పద్యములా?

కర్ణు:—మన వంటవస్తు సంభారముల ఘుమ ఘుమ వారి ప్రాణములఁ దీయునట్లుండవలెను.

శకు:—ప్రతివిషయమునను "నిట్టిసౌభాగ్యము మనకు లేదే" యని వారేడ్చునట్లుండవలెను.

కర్ణు:—నీతాంబూలపు పరిమళము ద్రౌపది మనస్సు పాడు చేయవలెను.

దుర్యో:—ఇంతచేసినను వారు వగచెదరో! వగవరో!

శకు:—సందేహమేల? తప్పక వగచెదరు.

గీ॥ తమకు సంపదలేని దుఃఖమును మించి
పరులు తులలేనియట్టి సంపదల తోడ
వెలుఁగుచున్నార లనునట్టి వెత దహింప
నెవఁడు జీవింపగల్గు నీభువిని? రాజ!

కర్ణు:—వగనుటే కాదు. వారుచచ్చినంత పనియగును. ఈవైభవములు, ఈభోగములు, ఈసంపదలు చూఁచి ద్రౌపది సహించునా, యుధిష్ఠిరుఁడు బ్రతుకునా?

దుర్యో:—ఇద్దఱును జత్తురు.

శకు:—వారికై ధర్మజుఁడు దాఁటీయును.

దుర్యో:—భీముఁడో నారిననుసరింపఁగలఁడు.

శకు.—ఇఁకఁగవలుండియేమి? ఊడియేమి?

దుర్యో:—(సంతోషముతో) హాహాహా! భూమి అపాండవము. హాహాహా!

కర్ణు:—అర్జునునితోఁ బోరుట కవకాశములేని నాయీబాహు వీర్యమేల ?

దుర్యో:—భీముఁడులేకున్న నాపగతీరుటెట్లు ?

శకు:—అందఱును బాగుండవలెను. వారుబ్రదికియే మరణ వేదన ననుభవింపవలెను.

దుర్యో:—అదియే మనమోదము. రండులోనికిపోయి యింకను నాలోచింతము (లేచుచుండగా)

తెర పడును.

---

## రెండవ రంగము

[ప్రదేశము:—కౌరవుల గోవులున్న ద్వైతవనభాగము. దుర్యోధనుని శిబిరమునకు ముందున్న స్థలము; ప్రవేశము:—ఏర్పరచిన గద్దెపై దుష్టచతుష్టయము. చుట్టునున్న రత్నకంబళములపై గాయకనర్తకవందివైతాళికాది జనులు. నర్తకి యాడుచుండును. దుర్యోధనుఁడు సత్కరించును.]

కర్ణు:—ఇఁక సంగీతము.

[గాయకులుపాడఁగా దుర్యోధనుఁడు సత్కరించును.]

శకు:—ఏదీ మన మహారాజప్రశస్తి.

కర్ణు:—ఆస్థానకవులు రచించిన పద్యములా?

శకు:—అదిగో వందులు సిద్ధముగానున్నారు. ప్రారంభింపుఁడు.

దుర్యో:—ఏమి కవులో ?

శకు:—కవులకన్న ఘనముగ వందులుపాడిన వనము ప్రతిధ్వ
నించును. కానిండు.

వందిమాగధులు:—జై ! కురుకులపయః పారావారరాకాసుధా
కర ! గాంధారీగర్భముక్తాఫల ! దుర్యోధనసార్వభౌమ !
అవధాన్ మహారాజ !

1-వ వంది:—

సీ॥ కళలు భేదింపఁగా గతిమారుచుండునా
చంద్రుఁడెంతో ! రాజచంద్ర! నీకు
ఏకాకియై నిత్యమేఁగుచుండెడి ప్రభా
కరుఁడు పోల్కియె ప్రభాకరుఁడ ! నీకు
జ్ఞాతులౌ యసురులచేత గెంటఁబడిన
యింద్రుఁ డేపాటి రాజేంద్ర ! నీకు
భూతియుండియుఁగూడ ముష్టెత్తుకొను రాజ
మౌళియాసరి రాజమౌళి ! నీకు

గీ॥ పగర మాయవేషాలఁ జంపఁగదలంచు
శ్రీశుఁడన నెంతయౌను ధాత్రీశ ! నీకు
విశ్వమేలంగఁదగుమూర్తి ! విమలకీర్తి !
శాంతమూర్తి ! సుయోధన చక్రవర్తి !

2-వ వంది:—

సీ॥ ఏప్రభుఁడీక్షింప నేన్గులు సింగముల్
భల్లూకములు భీతిఁబాఱిపోవు
నేరాజుఁబొందనే గోరి రంభోర్వశీ
మేనకాదులు ప్రీతిఁబూనియుందు
రే ఱేఁడు వాంఛింప హేమంబు రత్నముల్
గుప్పతిప్పలుగాఁగ నుప్పతిలునో
యేపతి యైశ్వర్య మీక్షింప సురలకుఁ
గూడ నీసునఁ గనుగుట్టుచుండు
గీ॥ నే నృపాలుఁడు ధర కామధేనువగును
నే జనేశ్వరుఁడిల కల్పభూజమగును
నే మహారాజు మాకెల్ల నేడుగడయొ
యట్టి రారాజు వొగడంగ నలవియగునె?

3-వ వంది:—

ఆ॥ వె॥ కామధేనువనినఁ గల్పవృక్షం బన్న
జంతువౌను లేక జడిమమగును
నీకు నీవ సాటి నిఖిలేశులందున
రత్నజాతి ధార్తరాష్ట్రజ్యోతి.

దుర్యో:—మాకు మహానందము [సత్కరించును].

కర్ణు:— నేఁటికి మీ ప్రదర్శనములు చాలును.

శకు:—మీమీ గుడారములకుఁ బొండు.

[దుష్టచతుష్టయము గద్దె దిగి ముందునకు మాటాడుచు నడచుచుండును. మిగిలినవారు నిష్క్రమింతురు.]

కర్ణు:—రాజా! నకులసహదేవులింకాక వచ్చియుండిరిసుమా!

శకుని:—ఏమి! ఆంగి మన మహారాజ ప్రశస్తి వినిరా?

దుర్యో:—ఏమో! వినినట్లుతోచదు. ఉదయమునను త్సవమునం గూడ వారైదుగురుం బరాఙ్ముఖులుగ నుండి తమతమ పనులలో నిమగ్నులై యున్నట్లు తోంచెడిని.

గీ॥ చూంచియును జూడనట్టులం జూంచిపోవు
చుండుటేతప్ప ఖేదించుచుండునట్లు
కానుపింపరు పాండవుల్ కర్మమేమొ!
చమురు ఖర్చయ్యు బిడ్డలు జచ్చిరనెడు
వాక్కు మనయందు నిక్కమై వరలునట్లు.

కర్ణు:—రాజా! అదేమట్లనెదవు. నిన్న నీవు సహదేవుని మొగము చూడలేదా యేమి!

శకు:—ఉదయమున నూరేగింపు టుత్సవము నుజూంచిన యుధిష్ఠిరుని మొగమున నెత్తుటిబొట్టున్నదీ ?

కర్ణు:—అర్జునుండు చూడలేక నేదో చనె.

దుర్యో:—ఏమో! నాకేలనో నిరుత్సాహము.

శకు:—(తనలో) ఈతనికేలనో నిరుత్సాహము కలిగినది.

కర్ణు:—త్వరలో నుత్సాహము కలుగంగలదు.

గోపాలుడు:—(ప్రవేశించి) జోహారు మహారాజా! జోహారు.

దుర్యో:—మాటలసందడిని ... అప్పుడే ... కర్ణా చూచినావా? మన ఘోషము లవిగో మామా!

కర్ణు:—ఆహా! పాల్కడలిపై నురుగు జిమ్మినట్లు—

శకు:—శరత్కాలపు వెన్నెలరీతి-

దుర్యో:—ఎంత యాహ్లాదకరముగా నున్నవో!

కర్ణు:—చూచినకొలఁదిని యుత్సాహము పుట్టుచున్నది.

దుర్యో—తెగలు తెగలుగ విభజించినారేల ?

శకు:—వేనికవివేరు. అవి వత్సంబులు. దాపువివత్సతరంబులు.

కర్ణు:—ఏడాదిలోపు దూడలువేరు. పైవివేరు.

శకు:—అల్లవి మహోక్షంబులు.

దుర్యో:—ఆఁబోతులా?

శకు:—అవును. వానిని దూరముగానుంచిరి. ఇల్లివి ధేనువులు, ప్రక్కవి తర్ణకంబులు.

దుర్యో:—ఈగోవులను జూచినతోడనే దుష్టమృగముల బాధనుండి కాపాడవలెనని కోరిక, ఉత్సాహము.

శకు:—అవశ్యము కలుగవలసినదే.

దుర్యో:—వేఁటాడి క్రూరమృగములఁగూల్చి మన ఆవుల నకంటకముగాఁ జేయువలెను.

కర్ణు:—లేళ్లనుసైత మిచ్చటినుండి తఱిమివేయువలెను. లేకున్న వానికొఱకు క్రూరమృగములు మరిగి మన గోవుల సంహరించును.

దుర్యో:—నిజమే! లెండు మీమీ యాయుధములఁ దీసికొండు.

తెర పడును.

## మూఁడవ రంగము

[ప్రదేశము:— దేవలోకము, ఇంద్రసభ; ప్రవేశము:— ఇంద్రుఁడు బృహస్పతి చిత్రసేనుఁడు మొదలగువారు యథోచితముగా కూర్చుందురు. నారదుఁడు ప్రవేశించును.]

ఇంద్రుఁడు:—(లేచి) దేవర్షీ! అభివాదనములు.

నారదుఁడు:—దేవనాయకా! అభివందనములు.

[ఇరువురుఁ గూర్చుందురు.]

ఇం:—ఎక్కడనుండిరాక స్వామీ?

నా:—భూలోకములోని భరతవర్షమునుండి.

ఇం:—భారతవీరులకుఁ గుశలమా? మా యభిమానునకు క్షేమమా?

నా:—కురువీరులకుఁ గుశలమే!

ఇం:—కౌంతేయులకు? అందు నర్జునునకు?

నా:—ఆపంచరత్నములకు సానబెట్టుసమయమిది. క్షేమమెట్లు?

ఇం:—ఏమది యట్లనుచున్నారు?

నా:—దాన వారికి మేలేకలుగవచ్చును.

ఇం:—సానబెట్టు సమయమా? మేలుకలుగుటా? అనఁగా?

నా:—ఏమియు లేదు. దుర్యోధనచక్రవర్తి వారలకు శృంగభంగముసేయు ప్రయత్నమున నున్నాఁడు.

ఇం:—ఎట్లు? ఏల?

నా:—ఘోషయాత్రకు బయల్వెడలినాఁడు.

బృహస్పతి:—కొండ తలక్రిందఁ బెట్టుకొని తాళ్లకై వెదకు కొనునట్లింత శ్రమయేల? దివ్యదృష్టిచే సర్వమిూక్షింపుము. అదుగో చూడుము.

చం॥ అనుజులు, బంధులున్, హితులు, నాప్తులు గొల్చుచు నుండగా సుయో
ధనుఁడిపుడున్న వాఁడదిగో ద్వైతవనంబున దుష్టబుద్ధితో
నెనిమిదివేల తేరులును, నేన్గులు తొంబదివేలు, నశ్వము
ల్గనఁగను వేలుతొంబదులు, లక్షలకాల్బురు తోడునీడగాన్.

ఇం:—అవును. అట్లయిన దేవగురూ! నేపోయి యాతనికి శృంగభంగముఁ జేయుదునా? ఏమి నారదా?

బృహ:—నీవు స్వయముగ వెళ్ళి పోర్వఁదగిన యోధుఁడు కాఁడే!

నార:—పిచ్చుకపై వజ్రాయుధమా?

ఇం:—అట్లనెదరేమి? పిచ్చుకకాదు పిశాచము.

నా:—తొందర యుడుగుము.

ఇం:—కాదు నారదా?

నా:—నేనొక యుపాయము సెప్పెదను.

ఇం:—ఏమది?

నా:—మనమేల ప్రయత్నింపవలెను?

ఇం:—మరెవరు?

బృ:—ఎవఁడు త్రవ్వుకొన్న గోతిలో వాఁడే పడును.

నా:—చెఱపకురా చెడెద వనుమాట వృథకాదు గదా?

బృ:—జ్ఞాననేత్రమును దెఱచుము.

నా:—వాని చేష్టలఁబట్టియు సాహసమునుబట్టియు భావివిష యముల గ్రహింపుము.

సీ॥ తనదాష్ట్యమిఁక నెవ్వరును నడ్డలేరను
తెలుఁగున లేళ్లను దఱుముకొనుచు
తనుచేయఁబోయెడి పని చెప్పననురీతి
బెబ్బులులంగొట్ట నుబ్బుకొనుచుఁ
దనకుఁ గల్గెడుఫలంబను భాతిఁ ద్రొక్కిన
త్రాచులు రేఁగగాఁ గాచికొనుచుఁ
దాఁగూడ వనమృగతతిలోని వాఁడను
కరణివి యడవిలోఁ దిరిగి తిరిగి

గీ॥ తనకు నక్కఱదీర్తురు తనజనంబు
లనఁగ మృగయులచేతఁ గాపాడఁబడుచు
పరువమునఁ, గల్మి, నరయమి, దొరతనాన
మిన్ను మన్నునుగానక మిట్టిపడును.

ఇం:—ఔను నారదా! అదిగో దేవగురూ! ధేనువులంజూఁచు చున్నాఁడు- వేఁటకై బయలుదేరినాఁడు- వేఁటాడు చున్నాఁడు-

బృ:—క్రమక్రమముగ ద్వైతవనసరోవరమును సమీపించి నాఁడు.

నార:—అది దేవతలదేయని ప్రసిద్ధికదా ?

ఇం:—అవును. గంధర్వరాజగు చిత్రసేనునిది.

చిత్రసేనుఁడు:—చిత్తముస్వామీ ! నాక్రీడాసరోవరమే.

నార:—ఏమి నీసొత్తు నపహరింపనీచుల నుపేక్షసేయుదువా?

ఇం:—ఏమి చిత్రసేనా ?

చిత్ర:—దేవనాయకా ! దేవర సెలవులేనిదే సభనిడుట ధర్మమా! సేవకుల నంపినాను. వీఁడొక లెక్కయా?

ఇం:—ఔరా ! మూఢుఁడు. అగ్నిజ్వాలపై బడియెడు తుమ్మెదవలె భ్రమసి తత్సరోవరప్రాంతమున గ్రీడాగారముల నిర్మింపఁగోరుచున్నాఁడు.

నార:—ఆమాటలు వినుఁడు.

[ తెరలో ]

చం॥ కలకలనవ్వుతామరల కాంతులు తామర పాకులందునన్
బిలబిలనాడుచుండు జలబిందువులున్ గడుమోదమోహనుల్
గొలిపెడి రాజహంసములఁ గూడి మనోహరమైనయట్టి యి
క్కొలనిదరిన్విహారమునకు న్భవనంబులఁగట్టఁగోరెదన్.

నార:—(హేళనముగా) ఆతని మీరేమిచేయఁగలరు? రాజాధిరాజు.

ఇం:—ఆతనిపాలిటి పరేతరాజును నేనుండగనే !

[తొందరతోఁగొందఱు గంధర్వసేవకులువచ్చి]

సేవ:—దేవనాయకా ! గంధర్వరాజా ! మనసరోవరముచెంతఁ గ్రీడాగారములు గట్టుచున్న దుర్యోధన చక్రవర్తి సేవకుల యడ్డగా నాయుధములులేని మమ్ము నారాజు

తటిమితటిమి వేఁటాడినాఁడు. చూడుఁడు దెబ్బలు (చూపుచుండు).

బృ:—ఏమి వీరుఁడు! ఎంతధూర్తుఁడు!

కం॥ మెకములనిన భయమో సే
వకులను వేఁటాడఁబూనె మహితాత్ముఁడు వీఁ
డౌకఁడే కనుపించెడిఁ బి
చ్చుకపై బ్రహ్మాస్త్రమేయు శూరుఁడు వహ్వా!

ఇం:—చిత్రసేనా! చతురోపాయముల సాధించి నీచిత్రవిచిత్ర రణోపాయములచే జయించి ప్రాణములతో నాసుయోధనుని నాపాదముల చెంగటఁ బెట్టవలయును.

చిత్ర:—చిత్తముదేవా! పాండవులచేఁ "గాఁగలిగిన కార్యము గంధర్వులు తీర్చి" రనిపించుకొనెదము. వీరసేనా! పరివారము హెచ్చరిక.

తెర పడును.

---

## నాల్గవ రంగము

[ప్రదేశము:—ద్వైతవనసరోవరతీరము. ప్రవేశము:—క్రీడాగారములఁ గట్టుచున్న కౌరవసేవకులు, వారిని నివారించుచున్న గంధర్వసైనికులు.]

సేవ 1:—అయిన మీయుద్దేశము?

సైని 1:—మీరిందుండఁదగరని.

సేవ 2:—ఏలనయ్యా ?

సైని 1:—ఇయ్యది చిత్రసేనుఁడను గంధర్వపతికిఁ గ్రీడార్థంబు కల్పితంబు.

సేవ 3:—మేము దుర్యోధన సార్వభౌముని భృత్యులము తెలియునా?

సైని 2:—అయిన ?

సేవ 2:—ఆయనపరాక్రమము మీరా తెలిసియే యుండును.

సేవ 1:—మేమాయనకిందుఁ గ్రీడాగారములు నిర్మింప నియోగింపఁబడినారము.

సైని 3:—మిమ్మిందుండి పంపివేయుటకు మేము నియోగింపఁబడినవారము.

సైని 1:—మీరిందుండి తొలఁగిపొండు.

సేవ 2:—ఏమిరా ? (తనవారివైపుఁ జూచును.)

సేవ 1:—మనకెందులకు గోల? పోని పోయిచెప్పుదుమా ?

గంధ:—మీరాజునకు మాపాక నెఱిఁగించి యభిమతమును మార్చుకొనుమనుఁడు.

సేవకులు:—అదే మేలు.

సైనికులు:—ఉభయపక్షములకు.

[కొందఱు సేవకులు దుర్యోధనునకు వివాదవిషయ మెఱిఁగింప నిష్క్రమింతురు.]

గంధ:—నాయకులారా! మనకేల లేనిపోనివివాదము? రాజులు రాజులుఁ జూచుకొనిమెదరు.

[తెరలో]

దుర్యో:—ఏమి! గంధర్వులా! గర్వాంధులా? రాజాధిరాజు నగు నాకే యాటంకమా? ధిక్కారమా? సంగ్రామ సింహా! రణసింహా! జయసింహా! సైన్యము హెచ్చరిక-

[సంగ్రామ సింహాదులు ప్రవేశింతురు.]

సంగ్రామసింహుఁడు:—గంధర్వులారా!

మ॥ అసమాన్యుండలధార్తరాష్ట్రమణివిఖ్యాతుండుయోధుండునీ
దెసఁ గ్రీడాభవనంబుల న్నిలుపనాదేశించియున్నాఁడు మీ
ర్మసలంగాజనదిచ్చుటన్ విడుఁడికుర్మార్గంబునుర్వారదర్పోన్నతుం
డుసతీయుక్తుఁడు వచ్చువాఁడదిగో లెండో పోవుఁడో వేగమే.

సైని 1:—(తనవారిఁజూచి నవ్వి) ఏమి మీరాజంత యవి వేకియా?

గీ॥ ఎదుటివారిని దన్నును నెఱుఁగఁబోఁడు
మానమును బ్రాణమును బాయఁబూనినాఁడె?
కడఁగు గంధర్వవరులతోఁ గయ్యమునకు
గాలిచేఁగొని తలగోకికొనెను నటుల.

సైని 2:—బుద్ధిమంతుఁడై చనుటలెస్స.

[కొందఱుసేవకులు పోయిచెప్పగా తెరలో]

దుర్యో:—ఔరా! అంతపొగరా! దుశ్శాసనకుర్వహా

దుర్ముఖవివింశతిచిత్రసేనవిందానువిందులారా! మీమీ సైన్యములతోఁబోయి దుర్వినీతులగర్వమువాపి సరోవర మాక్రమింపుఁడు. సురేంద్రుఁడు వారికి సహాయము సేయవచ్చినను గణింపకుఁడు. ఇదె నాహెచ్చరిక.

[తెరలో పెద్దకలకలము.]

సైని 1:—ఓహో కౌరవులారా! మాపై నేలయాగ్రహము.

సైని 2:—ప్రియపూర్వకముగ మాట్లాడిన వినరుగా?

సైని 3:—మాపూర్తిసేనవచ్చును. మీసంగ్రామసింహత్వమో గ్రామసింహత్వమో తేలఁగలదు.

సైని:—ఆహా! మీఁదిమీఁదికి వచ్చుచున్నారా? మదాంధు లారా! త్వరలో మీకు శృంగభంగము కాగలదు.

[సైనికులు నిష్క్రమించుచుండగా]

తెర పడును.

---

## ఐదవ రంగము

[ప్రదేశము:—గగనభాగము; ప్రవేశము:—పాడుకొనుచు భూలోకమునకు దిగుచున్న నారదుఁడు.]

నార:—ఆహా! హరినామసంకీర్తన మెంతహాయి! గమన శ్రమమించుకయునులేక నిట్టె భూమిపై వ్రాలితినే! హరినామసంకీర్తనమున కాత్మానందమొకటి తోడ్పు

ఆత్మానందము కాదామఱి! కౌరవులను ఘోష యాత్రకుఁ బ్రేరేచి, ఖేచరులను వారిపైఁబురిగొల్పి కావలసిన యాహార పరికరములను సేకరించుకొని యున్నాఁడను. ఇఁక వంటకావలెను. (ఎదుటఁజూచి) అదిగో! వంటలవాఁడు కానున్న భీమసేనుఁడిటేవచ్చు చున్నాఁడు. [భీముఁడు ప్రవేశించును]

నార:—భీమసేనా! కుశలమా?

భీమ:—(నమస్కరించి) తమదయవలన.

నార:—తొందరపనులమీఁదఁ దిరుగుచున్నట్లున్నావే!

భీమ:—చిత్తము.

నార:—ఏమది?

భీమ:—అన్నగారు సద్యస్కందనయజ్ఞము చేయుచున్నారు. అందులకై ఫలమూలాదివిశేషంబుల సేకరింప వచ్చి నాఁడను.

నార:—సరియేకాని భీమసేనా! నీ కొక నాటకమును జూపింతును. చూచెదవా?

భీమ:—(నవ్వి) తమరు కలహప్రియులు. మాలోన మాకుఁ గయ్యము గల్పింతురేమో! ఆలస్యమగును- అన్నగారు కోపింతురు- క్షమించుఁడు.

నార:—కాదోయి. నీకీవృక్షఫలములు గావలయునా?

మ:—కావలయును.

నార:—ఈవృక్ష మధిరోహించియే తీరవలయునుగదా!

భీమ:—చెట్టుపై నేమినాటకమయ్యా స్వామీ!

నార:—చెట్టుపై నెక్కియే చూడవచ్చును; సుయోధన శృంగ భంగము.

భీమ:—(ఆశ్చర్యముతో) సుయోధన శృంగభంగమా! ఎట్లు?

నార:—తినఁబోవుచు రుచియడుగనేల? చెట్టు పైకొమ్మనెక్కి నీపనిచేసికొనుచు చూడుము. నీవున్నవైపునకుఁ గుడి వైపుగా—ఏమి! కన్పించుచున్నదా?

భీమ:—[చెట్టెక్కి పండ్లుగోయుచు, చూఁచి హర్షముతో] ఏమది!

కం॥ ఘోరాయుధహస్తులు, దు
ర్వారబలోన్నతులు, మేరుపర్వతతుల్యుల్
ధీరులువా రెవ్వరొకో!
కౌరవసైన్యంబుఁ దాకఁ గడఁగిరదేలా?

నార:—వారా? గంధర్వులు.

భీమ:—ఎందులకా కయ్యము?

నార:—చిత్రసేనుని క్రీడాసరోవర మెఱుఁగుదువా?

భీమ:—ఆ! ఎఱుఁగుదును.

నార:—మీవారాసరోవర మాక్రమింపనెంచిరి. దానఁ గయ్యము-

భీమ:—(కోపముతో) ఏమి! జనపదాక్రమణము చాలదా? అరణ్యాంతర్భాగాక్రమణమునకుఁగడంగుటా!

నార:—పాపము మీరా యూరుకొనుటకు? వారుగంధర్వులు- ఎంత నరులచేఁ దృణీకరింపఁబడినను- ఎంతచెడినను- ఖేచరులు.

భీమ:—నారదా! దుశ్శాసనాది కౌరవులు ససైన్యంబుగా దుర్యోధనుని బాలికిఁ బాఱుచున్నారు. హాహ్హాహ్హా! (నవ్వును).

నార:—వీరులు-శూరులు-విక్రమార్కులు గాదామఱి!

భీమ:—ఆహా! కర్ణుండొక్కరుండు మాత్రము సుస్థిరుండు. తమ్మునితోఁ బోరఁదగినవాఁడే!

నార:—పాపము భీమా! మీవారికి నీవుపోయి సాయము చేయరాదా?

భీమ:—నేనా! సాయమా!! చేయుటా!!!

నార:—ఏమి భీమసేనా! చేయనేలేవా?

భీమ:—చేయఁగలను- కాని చేయను.

నార:—మీయన్న యాజ్ఞయైనచో.

భీమ:—ఆహా! మాయన్న యంత యవివేకియనుకొంటిరా? అంత వెఱ్ఱివాఁడా?

నార:—వెఱ్ఱియో! మొఱ్ఱియో! అతఁడు చెప్పిన నేమిచేయుదువు?

భీమ:—ఆయనననొప్పించి, యభిప్రాయము మార్చఁగలవాఁడను.

నార:—ఆతని నొప్పింతువా?

భీమ:—ముమ్మాటికి.

నార:—ఆమాటపై నుండఁగలవా ?

భీమ:—నారదా ! ఈపాండవులన్న మాటను దాటువారనుకొంటిరా? ఎన్నడు నట్లనుకొనఁకుము. [పరిక్రమించిచూచి] అదిగో ! దుర్యోధనాదులు యుద్ధార్థము బయలుదేరినారు.

నార:—గంధర్వులో !

భీమ:—నారజేయులే- అతఁడే సుయోధనుఁడు.

మ॥ అదిగోతమ్ములు తోడుగాశకునితో నాయత్తుఁడై నావలెఁ
గదచేఁబూని సుయోధనుండు సనుచున్నాఁడాజికిఁ జేరె న
ల్లదెయుద్ధంబటి ఘోరమాయొఖచరుల్ ధాత్రింబడఁ వచ్చువాఁ
డెనురన్ శత్రులఁ జిత్రసేనుఁడగుగాదే? నిక్కమాతండె ఖేద్!

ఆహా ! దుర్యోధనున కీనాఁడే శృంగభంగము? [చెట్టుదిగుచు తనలో] ద్రౌపది కీదృశ్య మెట్లు చూపఁగలను. [చెట్టుదిగిప్రకాశముగా] నారదా ! వేళమించుచున్నది. అన్నగారు కోపింతురేమో ! నాకు సెలవా ?

నార:—నాటకమును సాంతముగఁ జూడకుండనే! నీయిష్టము.

[భీముఁడు నిష్క్రమించును. పాడుకొనుచు
నారదుఁడు పోవుచుండగా]

తెర పడును.

---

## ఆఱవ రంగము

[ప్రదేశము:–రణరంగము. ప్రవేశము:–రథస్థుఁడైన కర్ణుఁడు.]

కర్ణుఁడు:—ఔరా! ఏమియుద్ధము! మాయాసంగరము! ఎవ్వఁడాగనోపు? గంధర్వులు కన్పడినగదా శక్తి యున్నను లేకున్నను బోరుట. పాండవు లున్నవైపునకు బలమంతయుఁ బోవుచున్నదే! ఏమిచేయుదు?

[తెరలో]

గీ॥ ఘనులచాటున డాగుచుఁ గపటి పోర
నౌర! ఏన్గులుచెదరెను తేరులన్ని
భగ్నమయ్యె గుఱ్ఱములొ్బాటె నరులు
గూలి రయ్యయ్యొ! కురురాజ! ఘోరమాయె!
తొందరగాఁ బోవుదము మామా!

కర్ణు:—అదిగో! రారాజు ససైన్యాంబుగా వచ్చుచున్నట్లున్నది. ఇప్పుడైన నాపరాక్రమముఁ జూపకున్న నీతని మెప్పువడయుటెట్లు? ఎవరితోఁ బోరి పరాక్రమముఁజూపను. (పరిక్రమించిచూఁచి) వీఁడెవఁడు?

చిత్రసేనుఁడు:—[ప్రవేశించి] అంగరాజా!

కం॥ ఇటులేలవచ్చెదరు? మీ
కిటు విద్వేషంబదేల? నేలనుమాతోఁ
బటుసంగరంబుఁ జేయఁగ
నెటుబో యెటువచ్చునో వచింపఁగఁ దరమే?

కర్ణు:—ఎవఁడవుర నీవు ?

చిత్ర:—సూతపుత్త్రినకు మేమెవరమో తెలియదు కాఁబో లును.

కర్ణు:—అవును. నీవెవ్వఁడవు ?

చిత్ర:—వయసు నందున్నాఁడవే ! ఇంతసేపటినుండియు నీతోఁ బోరుచున్న వారినే గుర్తింపలేవా ?

కర్ణు:—ఓరీమాయావీ ! నీవా ?

చిత్ర:—మాయావినిగాను. మాయామారకుఁడను.

కర్ణు:—ఎవరెవరి మారకులో తేలఁగలదు. ఓపికపట్టుము. తొందరేల ?

చిత్ర:—వాచాలా ! మాతోఁ బ్రత్యక్షముగఁబోరనెంచితివిగా! వచ్చితిమి. ఏదీ నీ-

కర్ణు:—ప్రత్యక్షముగఁగాక దొంగదోపున యుద్ధముసేయుట ఖేచరాధముల లక్షణము కావలయును. ప్రత్యక్ష ముగఁ బోరలేక-

చిత్ర:—పోరఁగలమో లేమో యెఱుఁగఁ గలాఁడ వాఁగుము.

కర్ణు:—పోరఁ గలిగినచో మాయలేల ?

చిత్ర:—ఖేచరత్వమును జూపించుకొఱకు.

కర్ణు:—హా ! ఖేచరత్వము ! ఖేచరత్వము ! హాహ్హా ?

ఉ॥ మిన్నును మన్ను గానవుగ మింటఁజరించినయంతమాత్ర మా

కన్న నదేమిటోఘనత ? కౌరవులన్నఁదలంపవే యనిఁ

ఇన్నరు లిందశ్రీల్గిరని ఇల్లలుకంగనె పండువౌనొకో!
నన్నుదలంపుమీ రణమునన్ననుజంపుమి దర్పమున్నచో!
ఏదీ నీఖేచరత్వమును జూపుము- చూచెదము!

చిత్ర:—

ఉ॥ కూటికి గుడ్డకుం బరులకొంపకుఁజేరి యమాయకు న్భవత్
కూటమునందుఁద్రిప్పి చెడఁగూయుచుఁ దత్తులవృత్తమూలపుం
గీటకమీవయై మిగులుగీర్తినశింపఁగ దిన్నయింటికే
చేటు ఘటించుబుద్ధుఁడవు చేతులు రావుర నిన్నుఁ జంపగన్‌.
మాఖేచరత్వ మెట్లుచూపఁగలము!

కర్ణు:—ఓరీ ప్రేలరీ!

ఉ॥ చాలునుజాలు నోటినికసర్దుకొనందగు హద్దుమీరుచుం
బ్రేలిన నేమిలాభము? వివేకము లేదొకో! బాహుశక్తికిం
జాలక నోటిడాబునను చల్లఁగ జారఁగఁ జూఁచెదోరి! మం
త్రాలకు చింతకాయ లిల రాలునె? టక్కరిఖేచరాధమా!

[ఇరువురును ప్రక్కకుఁబోయి పోరుచుందురు. దుర్యోధన
శకునులు ప్రవేశింతురు.]

దుర్యో:—

కం॥ మామా! కాంచితెకర్ణుని
ప్రేమను? ఎటుపోరుచుండె! విశ్వాసముతో
నామర్యాద నిలిపెఁ గ
ర్ణామాత్యుండాహా! నాదు ప్రాణంబితఁడే!

శకు:—ఔర! ఏమీయుద్ధము!! ఎంతలో నెంత యైనది!!! అటు
చూడుము. గంధర్వు లనంతసత్త్వులై యనేకులు సూత
పుత్త్రుని జుట్టుముట్టినారే!

కం॥ కొందఱు రథము న్హయాజులఁ
గొందఱు నాయుధముల మఱి కొందఱు సూతుం
గొందఱు తెగనేసి రహో!
ఎందో సనఁజూఁచు కర్ణుఁ డేఁడీ యేఁడీ?

అయ్యారె! విరథుండై కర్ణుఁడు వికర్ణు రథమెక్కి పాఱి
పోవుచున్నాఁడే!! నే పోయి పోరెదను.

(నిష్క్రమించును.)

దుర్యో:—(తెల్లబోయి) ఔరా!

ఉ॥ ఎవ్వనిఁజూఁచి పాండవులనిట్టటుఁ జేయఁగఁ గల్గినాఁడనో!
ఎవ్వనిలావు నమ్ముకొని యిట్లరుదెంచితిసాహసించి ఆ
కవ్వఁడి కీడనందగినకర్ణుఁడె పాఱెడి నేమి చోద్యమో!
ఎవ్వరిఁ జీరువాఁడ నిఁక నెవ్వరు కావఁగలారు దైవమా!

[తెర యెత్తఁబడును. చిత్రసేనుఁడు ముందునకు వచ్చును.]

మ॥ అల మీా కర్ణునిజూడవేమి? విరథుండై అస్త్రములేక యో
ధుఁడు సూపుందనకాలిసత్తువనహో! దోఃదర్పమీాడేర! నె
క్కడి వీరుండుసుయోధనా! వినుము ఏకాంతంబొకండుండెనీ
తఁడు నీగుర్వఁటకొన్నియంశముల సత్యంబేకదా? మిథ్యయా?

దుర్యో:—ఆతనిగతియే నీకును నల్పకాలములోఁ బట్టఁగలదు. వీర్యమున్నచో-

చిత్ర:—దుర్యోధన సార్వభౌమా! మాటల తొందరేల? సాంతముగా-

దుర్యో:— అట్లు మనవిచేసికొనుము.

చిత్ర:—(హేళనముగా) చిత్తము. అయ్యా! తమరువచ్చినపని-

దుర్యో:—నెరవేర్పగలము.

చిత్ర:—అది కాదు- ఏమని తెలియక అడుగుచున్నాఁడను.

దుర్యో:—లీలావిహారముకొరకు దయచేసితిమని తెలియుదా?

చిత్ర:—హా! ఏమిలీల!

దుర్యో:—మాలీలలో నిన్నులీనముచేసికొందుము. మాయల మారీ! నీమాయలును మంత్రములును మాయొద్ద సాగవుసుమా!

చిత్ర:—మీవలె నమాయకులను మాయచేయలేము మేము.

దుర్యో:—దర్పమున్నచో మాయలేల? మీవారితోఁ కబురు చేయుటకు పరివారమున్నదో?

చిత్ర:—పరివారమును రప్పించియే పనిగావింతును. లీలావినో దార్థ మరుదెంచితిరా సార్వభౌములు! హా! ఏమిలీల రాజలీల!

చం॥ ఒకఁడవనీధవుండయిన నొప్పనుభార్యగ భూతలంబు వా
నికి నరనాథుపట్టి ధరణీసుతుఁడౌను గతింపరాజు రా

జక్కామరుఁడేలఁగా ధరణిసంతతియేయగు నాథులట్లు ద
ల్లికిమగ లీన్నృపాలకుల లీలల నెన్నఁగ మాతరంబొకో!

దుర్యో:—హ హ హ! మీలీలలకును మాలీలలకును జాల భేదముగలదు.

సీ॥ శ్రీనాథునకు జోడు భూనాథుఁడెవఁడౌను
చోరుఁడై వస్త్రముల్జూరగొనఁగ
మీరాజపత్నికి నేరాజపత్నికా
నుద్ది ప్రాణాలు దీయుటను గనఁగ
మీరాజునకు సాటియేరాజు మారాజు
గురు పత్నులను చెఱగొనుటయుందు
మీతేనితోఁబోల్ప నేతేఁడుసరితూఁగు
అనిలోన వెనుజూపుటందు హడలి

గీ॥ కపటి! చోరత్వమునకీడె నృపులు మీకు
కరకుతనమున సాటె నిర్జరుల కేము
కపటి! జారత్వమునకీడె నృపులు మీకు
పిఱికితనమున సాటె నిర్జరులకేము.

చిత్ర:—దానికేమిగాని (హేళనముగా) మహారాజా! మనవి

ఉ॥ ఆవులఁగాయవచ్చితివి యావుల గాచుకొనంగబోక మా
తోవికటించి యుద్ధమున దుఃఖమునొందఁగ నేలనోయి? పో
మ్మావిధి నెన్నఁడైనఁజరియించిరె పాండవు? లింతకుఁ బలే
లావుగలాఁడనంచు మిగులన్ గరువంబునఁగన్నుగానవే?
అదిమాత్రము నీ శ్రేయస్సునకే భంగముసుమా!

దుర్యో:—(కోపముతో)

ఉ॥ ఆవులఁ గాయవచ్చితినో ఆలము సేయఁగవచ్చినాఁడనో
యేవిధినైన శత్రువులయేడ్పు కనుంగొనవచ్చినానొ యా
దైవమెఱుంగు నిప్పుడిఁక దారుణతీవ్రశిలీముఖంబులన్
నీవు వహించి నొవ్వఁగ ననిన్ తెలియుఁగలవాఁడ వాఁగుమా!

చిత్ర:—(రోషముతో)

ఉ॥ హాదురితాత్మ! ఓర్వక విషాన్నము వెట్టుటొ నీటఁద్రోయుటో
సోదరపత్నినీడ్చి సభసూడఁగనవ్వుచుఁ గోకలొల్చుటో
కాదిది యుద్ధమన్నఁ గల కావరమెల్లను తీరిపోవుఁటే!
నీదుహితంబుజెప్పినను నిక్కడు నీగ్గెరు విజ్ఞపిఁగదే!

దుర్యో:—(ఎకసెక్కముగా)

ఉ॥ యుద్ధమనంగ నేనెఱుఁగనోరి ప్రలాపము లేలరా? అసం
బద్ధము లైన రాగములఁబాడుచుఁ గాలము పుచ్చుటేర దు
ర్బుద్ధిని మాయవేషముల లోకుల మోసముచేయుటే కదా
సిద్ధము మాకులంబున ప్రసిద్ధము రెండును నేనెఱుంగనో.

చిత్ర:—(హేళనముగా) ఆహారనిద్రలు రెండును నెఱుఁగ కేమి! మీయుద్ధము లెఱుఁగమా! మాయుద్ధములు మాత్ర మట్టివికావు. కాగూడదు.

మ॥ అగురాయుద్ధము నాఁడు ద్రౌపదివివాహంబయ్యెనే నీవుచే
యఁగలేదేయదెయుద్ధ మిప్పుడిదెమీయుఁగేసుయుద్ధంబుమా

డఁగలేదే యిదెయుద్ధ మింకనిజదార్ఢ్యంబున్ బలంబున్ గనం
దగునేయుద్ధమునందు వీరుఁడవుగానన్ దేల్చుమీ శీఘ్రమే.

గంధర్వులారా! (సౌంజ్ఞచేసి) వీనిఁ గర్ణుని జేసినట్లు
సేయుడు - హెచ్చరిక!

దుర్యో:—కపటులారా! మాటలసందడినినుండ వెనుకనుండి
చుట్టుముట్టినారా?

చిత్ర:—యుద్ధమన మాటలుకాదు. [గంధర్వులకు సౌంజ్ఞ
చేయును. గంధర్వులు రథములస్త్రములు లేకుండఁగఁ
జేసి దుర్యోధనుని బట్టుకొందురు. దుర్యోధనుఁడు
పాఱఁజూఁచును. చిత్రసేనుఁడు వానిని కేశాకర్షణం
బున లాగి పెడకేలు విఱచి కట్టుచు]

ఉ॥ ఎచ్చటికేఁగఁజూఁచెదవు హీనుఁడ? మీవగుమంతనంబులే
పచ్చికమేయఁబోయినవి? ప్రాణములన్నను నంతలీపియే
జచ్చెదనంచు బాఱెదవు? చంపనులే సురనాథుతోడ నీ
కుచ్ఛితబుద్ధిబీరమునుగొంచెము చెప్పఁగఁగొంచుబోయెదన్.

దుర్యో:—(తనలో) ఔరా!

కం॥ ఉక్కఱుగ శృంగభంగము
నెక్కొనిజ్ఞాతులకుఁ జేయనేరక యకటా
చిక్కితి గంధర్వులకే
నొక్కటితలపంగ దైవమొక్కటితలఁచెన్.

చిత్ర:—ఖేచరులారా! యీతని వనితాసోదరపరిజనంబుల సహితము బాధించికొని రండు. [నిష్క్రమింతురు.]

దుర్యో:—

ఉ॥ ధర్మవినిర్మితంబైన మందిరమందునఁ దూఁగుటుయ్యలన్
దర్మిలిఁ గాంతతో సరసమాడుచు హాయిగనుండఁజాలునన్
దుర్మతి మాయచే ఖలులు తోడ్కొనిపోవుచునుండిరక్కటా
కర్మముచాలకున్న యెడ గాడిదగుడ్డు తలంపపాముకున్.





సుబోధన

# శృంగభంగము

## మూఁడవ అంకము

### తొలి రంగము

[ప్రదేశము:—పాండవుల యాశ్రమము; ప్రవేశము:—యజ్ఞ దీక్షితుఁడైన ధర్మరాజు, అతనితమ్ములు, నారదాదిమునులు]

ధర్మ:—నారదా! మేము ఇంద్రప్రస్థపురంబుననే యుండినచో నీయజ్ఞముఁ జేయఁగలిగియుందుమా?

నార:—నిజమే! అప్పుడు దేశ కాల పాత్రముల కర్హ్మమగురీతి వేరొకవిధమైన-

అర్జు:—రాజసూయాదియాగములఁ జేయవచ్చునుగదా!

ధర్మ:—ఎట్లయినను నీవాసమునకు నావాసమునకునుఁ జాల భేదము గానిపించుచున్నది చూడుఁడు.

గీ॥ సురభిపవనంబులఁ బీల్చి శుభ్రమైన
జలముఁద్రావుచు మధురమౌఫలములెల్ల
గడుపునిండఁగ భుజియించి గడుపవచ్చు
నేండ్లుపూండ్లును నిశ్చింత నీవనాన.

మఱియు

గీ॥ హరిణసంఘంబులం గూడియుండవచ్చు
గడుముదావహదృశ్యముల్ గాంచవచ్చు
సృష్టికావ్యము నిత్యమీక్షింపవచ్చుఁ
గోటకన్నను నీవనవాటి మేలు.

ఇట్టియవకాశంబుఁ గల్పించినందుల కా కౌరవులకు మనమెంతయుఁ గృతజ్ఞులము కావలయును.

[తెరలో]

మ. శరణో రాజలలామ! ధర్మతనయా! సాధించి దుర్యోధనుఁ
దరుణీ సోదర భృత్యయుక్తముగ గంధర్వాధముల్ గట్టి యీ
తెరువుఁ బట్టిరి పోవుచుండిరదిగో దీనంబుగా మిమ్ము సో
దరుఁడే "కావుఁడ"టంచు వేఁడెడి దయాదాక్షిణ్యముల్జూప రే!

ధర్మ:—(ఆశ్చర్యముతో) ఏమా కలకలము!

నార:—ఏమా! మీజ్ఞాతులగు దుర్యోధనాదులను గంధర్వ రాజగు చిత్రసేనుఁడు సపరివారముగా బంధించి గొం పోవుచున్నాఁడఁట.

ధర్మ:—ఏల?

నార:—వారిపై మీపై వోలెఁ గయ్యమునకుఁగాలుద్రువ్వెను. గాఁబోలు.

సంగ్రామసింహుఁడు:—[ప్రవేశించి] ధర్మరాజా! యివినామా టలు కావు. మీతమ్మునివే యనుకొనవలెను. (శరణో రాజ......అను పద్యంబుఁ జదువును.)

భీము:—హా హ్హా హ్హా! హ్హా హ్హా హ్హా!

ఉ॥ వందురినారమంచు వనవాసముచే మముచూఁచి సంతసం
బొందగవచ్చి నేఁడిటులనొందె పరాభవమహ్హాహా! బలే!
అందినజుట్టు నావిధినియందకపోయినఁ గాళ్లుపట్టునీ
చందమెఱింగి పాండవులు సాయముచేయఁగనంత వెఱ్ఱులే?

అర్జు:—

కం॥ నిలువెల్లవిషంబగు నీ
ఖలునకు నిటుగాఁగలిగిన కార్యము గంధ
ర్వులు దీర్చిరి మమ్మిఁక ని
ట్టులవేడఁగవత్తుమని యెటులఁదలఁచెడినో.

సహ:—

ఉ॥ ఉర్విసమస్తమిచ్చి విపినోర్వివసింపుచు దుఃఖపర్వముల్
బర్విననోర్చుకొంచు భగవంతుని నిత్యముకొల్చువారలన్
గర్వముతోడ కన్నులనుగానక హేళనచేయరాగ గం
ధర్వులు బుద్ధిచెప్పిరిటు దైవములేఁడొకొ ధర్మమియ్యగా!

ధర్మ:—సోదరులారా! ఏమిది: ఇది పరుషవాక్యములకు సమ
యమా? వారెవరు? మీకు నావంటివారే సుఁడీ!

గీ॥ కౌరవులకును మనకునుఁ గయ్యమైన
వారు నూర్వురైదుగురము వసుధమనము
యొరులతోఁ బోరుగలిగిన నొక్కమొగిని
యందఱము సోదరులము నూటైదుగురము.

భీము:—అన్నా! నిజమే. అతఁడు మనల నట్లు జూఁచినఁ గదా?

ధర్మ:—చూడకేమి. రాజ్యభారమంతయు దానెవహించి మనకు స్వేచ్ఛ నిచ్చినదాత.

భీము:—అట్టిపనియే గంధర్వులుకూడ చేయఁగలారు.

ధర్మ:—భీమసేనా! ఏమది! దీర్ఘక్రోధము దుర్జన లక్షణము సుమా! అదియుంగాక

గీ॥ "కావు"మని వచ్చునెడ భీకరవిరోధి
యైనఁ బ్రీతికావఁగ దయఁబూనవలయు
నిదియె కరుణాపరుల తెఱంగెంచిచూడ
దీనిమించు ధర్మంబు మేదినిని లేదు.

భీమ:—(సాభిమానముగా) అన్నా! ధర్మము ధర్మమందురే! ఏధర్మమాలోచించి యాతఁడిట్లు తలమించినవారితో తగవునకు సిద్ధపడెను.

ధర్మ:—అధర్మమున కొడఁబడినవాఁడు గనుకనే ధర్మాను జన్ముఁడ వని నీపాలఁబడి నిన్నర్థింపవలసివచ్చినది. అది యట్లుండ —

మ॥ శరణంబంచును గాచువారమని విశ్వాసంబుతో దీనుఁడై
గురుతేజోనిధి కానికాలమగుటన్ గోరంగ కాపాడమే
ని రసజ్ఞుల్ ప్రతివారుదూరుదురు కొంతేయుల్ కృపాహీనులా
ఱజాతుల్ గడునీచులున్ విరసులంచాచంద్రతారార్కమున్

నార:—అట్లైన్నటికిఁ బాండుపుత్రు లనిపించుకొనఁగూడదు.
వారి నిట్లు కాపాడినచో

కం॥ కన ధర్మజుఁబోలెడి రా
జును భీమార్జునులబోలు సోదరులెందున్
గనరారు లేరు లేరిక
నొనగూడరని జనులు దలలూఁపఁగవలదే.

భీమ:—(తనలో) ఏమి ! నారదుని చంచలబుద్ధి. నాతో నట్లు పల్కి యిపుడిట్లు మాటలాడుచున్నాఁడే! ముఖప్రీతి మాటలుపలుకుట కలహప్రియుల లక్షణముకాఁబోలు.

సహ:—ఆర్యా ! పరులు తలలూఁపుటచే మాకు తలవంపులు తప్పవుగదా !

భీమ:—ఏమి అర్జునా ! మాటలాడవు ?

అర్జు:—(ధర్మరాజుతో) అన్నా ! ఆతనిగాచుట యుక్తమని యెట్లు మావంటిమందబుద్ధులకుఁ దోఁచును. క్షమించ వలెను.

ధర్మ:—

మ॥ అకటా ! ఎంతటిమాట మీపరుషవాక్యార్భాటముల్
జాలుచాలుఁ
వికలత్వంబుడై యెట్టులోయనుజుఁడీవేళ మిమ్ముఁ వేడఁ గా
వక నేవో యనరానిమాటలనగా .......... యొగ్గులెం
చక లేలెండటు పోవరేల? మానవంశంబుచు బావింపరే!

భీమ:—అన్నా ! నాచేనెందులకు వారించెదరు ? "మనవంశ్యు బని" మనమర్యాద నాతఁడు కాచినాఁడుకదా ?

సీ॥ అనుమాన మనుమాట యావంతయును లేక
నీసుతో నీటఁ ద్రోయించినాఁడు
పినతండ్రి బిడ్డలమని యెంచకయే లక్క-
యింటిలోఁ బెట్టి కాల్పింపఁజూచె
మాయజూదంబున మనరాజ్యము హరించి
కట్టుగుడ్డలతోడఁ గానకంపెఁ
గొల్వులో మనదేవి కొప్పువట్టుకయీడ్చి
మానభంగము సేయఁ బూనినాఁడు

గీ॥ నీచుఁడై హింసపెట్టఁగాఁ జూఁచు గోచి
వెట్టఁబూనినదాది యీవేళవఱకు
మనము సేయు ప్రతిక్రియ మనకుమారు
చేసె గంధర్వపతి చిత్రసేనుఁ డిపుడే.

ధర్మ:—

మ॥ అగుఁ గష్టుండెసుయోధనుండుమనకుఁ జాహానించియేవచ్చెనే
నగతంబేమియు నెంచఁగాఁ జనదుసుమ్మైనన్ విరోధంబుఁజూ
పఁగ కాలంబిదె? యింటి ఆడుపడుచుల్ పైవారిచేఁజిక్కి-రే
మగునో ! పావనమైన వంశంబున కన్యాయంబు వాటిల్లదే!

భీమ:—మనయాలు నవమానమొనర్చిన ఖలు—

ధర్మ:—అయ్యో ! మీరు నా సోదరులుగారా ! ఏల నిట్లతని గానికాలమున నిందించెదరు. యజ్ఞదీక్షితుఁడనుగాని

లేకున్న నేనే పోయియుందును. దైవమా! నాకీ యజ్ఞఫలమిట్టి సోదరులమూలమునదక్కదు కాబోలును.

అర్జు:—అన్నా! మీరింత పరుషముగఁ మాటలాడఁదగునా?

భీమ:—ఆర్యా? మీమనస్సింత కష్టపెట్టుకొనవసరమేలకలిగెను?

ధర్మ:—నీవంటి తమ్ములుండుటచేత.

శా॥ ప్రఖ్యాతంబగు రాజవంశమున జన్మంబాదియున్ ధర్మరా
జాఖ్యంబొంది యధర్మవర్తనము సేయంజాలమోధుండునా
విఖ్యాతింగనువాఁడి కొక్కరునిఁ దావేడంగదప్పోను మీ
సౌఖ్యాటంకమటంచుఁ దేలెనుగదా! సాధింపనేఁజాలనే!

నానిశ్చయమిదే! యజ్ఞఫలముకన్న నాకు ధర్మమే వాంఛనీయము. ద్రౌపదీ! ధనుర్బాణ—ఒరుల నడుగ నేల? నేనే—(అని లేవఁబోవును.)

అర్జు:—అన్నా! శాంతింపుఁడు. భీమన్నా! అన్నగారియాజ్ఞ-

భీమ:—కానిండు. మీయిష్టమే కానిండు.

భీమార్జునులు:—మీయాజ్ఞకు బద్ధులము.

ధర్మ:—నన్నే పోవనిండు. లేదా! మీరే నాసోదరు లనిపించుకొని పుణ్యము గట్టుకొననెంచినచో—

ఉ॥ అంకిలి సెప్పలేదు వినయంబున వేడుకొనండి శత్రు లా
టంకము సెప్పిరా తగినడంబము చేవయుఁ జూపి తమ్ములన్
శంకలమేని దప్పక కడిందిదొలంగఁగబుచ్చి వారి నా
వంకకుఁ దెచ్చునందనుక వాయువునేని భుజింపకుండెదన్.

తెర పడును.

## రెండవ రంగము

[ప్రదేశము:—రణరంగము; ప్రవేశము:—యుద్ధసన్నద్ధులైన
భీమార్జుననకులసహదేవులు.]

భీమ:—తమ్ములారా ? దివ్యపురుషులగుట వారిపాటికి చాల దూర మేఁగియుందురు.

నకు:—మనకు కర్తవ్యమేమి ?

అర్జు:—సోదరులారా ! మనకు శస్త్రాస్త్రము లెందుకు ? ఇదిగో చూడుఁడు. ఉత్తరక్షణముననే వా రెందు బోఁగలరు ?

సహ:—వెనుక శ్రీరామచంద్రకుమారుఁడు ప్రయోగించిన యస్త్రములవంటివి ప్రయోగించిన గిఱ్ఱునఁ దిరిగి రాఁగలరు.

అర్జు:—ఇదిగో ! (అస్త్రముప్రయోగింపుచున్నాఁడు.)

సహ:—అదుగో ! వారు కొట్టుకొనివచ్చుచున్నారు.

అర్జు:—అన్నా ! భీమసేనా ! తమ్ములుదోడుగాఁ గౌరవసైన్యముతో గంధర్వసైన్యమునెదుర్కొని యాపుచుండుము. నే నీ చిత్రసేనునితోఁ బ్రకృతమునకుఁ గడంగెదను.

[భీమనకులసహదేవులు నిష్క్రమింతురు. చిత్రసేనుఁడు
ప్రవేశించును. అర్జునుఁడు రెండు నమస్కారబాణము
లాతనిపాదములపై వేయును.]

చిత్రసేనుఁడు:—(తనలో) ధర్మానుజన్ముఁడ వనిపించుకొంటివి సఖా !

అర్జు:—గంధర్వపతీ! వీరికిని మీకుఁ గయ్య మెందులకుఁ గలిగెను.

చిత్ర:—అడుగవలసిన రీతిని యడిగితివి గాన చెప్పెదను. ఈవనంబున మాకొలనున్నది—

అర్జు:—మీకొల నసఁగా?

చిత్ర:—మీ ఆశ్రమముపొంతనున్న యదే. దాని నీతఁడు యాక్రమింపనెంచెను.

అర్జు:—అది మీదా! (నవ్వి) హ హ హ!

గీ॥ కొండసెలయేర్ల నేర్పడ్డ కొలనికొకరు
నాథులనఁజెల్లునొక్కొ? గంధర్వరాజ!
కానను సుయోధనుండును దానిపొంతఁ
గాంతలంగూడి కాలంబు గడపనెంచె.

ఆమాత్రమునకే యింతకోపమా? ఇంతదుర్మార్గంబున కొడిఁగట్ట ఖేచరులకు ధర్మమా?

చిత్ర:—మాకన్న దుర్మార్గుఁడగు నీతఁడు మా సరోవరము పొంతఁ గ్రీడాగారములు నెలకొల్పి విహరింపనెంచుటకు మాయంతవాఁడు కావలయునుగదా?

అర్జు:—కాకేమి! సుయోధన సార్వభౌముఁడు—

చిత్ర:—ఎట్టిసుయోధనుఁడో యెట్టిసార్వభౌముఁడో తెలిసినదిగా.

అర్జు:—దానికేమి! జయాపజయములు దైవాధీనములు. మీరు దేవతలు.

చిత్ర:—దాని కేమిగాని యిప్పుడు నీవువచ్చిన పని ?

అర్జు:—చెప్పెదను తొందరేల? తొందరైనచో పోవచ్చును.

చిత్ర:—(తనలో) యీయస్త్రము పట్టువిడచినచో గదా !

అర్జు:—చిత్రసేనసార్వభౌమా !

కం॥ మాతో నేటికి వైరము ?
మీతో మాకేలరణము ? మిత్రత్వము నీ
రీతిని బాయఁగనగునే ? (మా)
జ్ఞాతులగు సుయోధనాది జనమును విడరే !

మఱియునో—

ఉ॥ ఖేచరధీరులార ! యని గీడగు మీకును మాకుఁగూడ సం
కోచము లేల మిమ్ములనుకోరితిమయ్యా!— యజాతశత్రుఁడీ
సూచననిచ్చె నీడఁగను సోదరులన్ బరివారమున్ మిమున్
యాచనచేయుఁబోమిదియె యాచితిగాన వచ్చినాఁడనేన్.

చిత్ర:—అర్జునా ! బాగుగనున్నది. మాకు ధర్మజుఁడా యిం
ద్రుఁడా ప్రభువు ? ఇంద్రునియాజ్ఞఁ ద్రోసిపుచ్చి
మీయన్నయాజ్ఞ యేల నిర్వర్తింపవలెను ?

అర్జు:—మాయన్న ధర్మవర్తిగనుక.

చిత్ర:—కిరీటీ ! మంచికొఱకుఁ జెప్పుచున్నాఁడను. ఏల మీ
కింత యనవసర ప్రతాపాటోపము ! కందకులేనిదురద
బచ్చలికేలనయ్యా !

అర్జు:—కందబచ్చలులకున్న కలయికనుబట్టి.

చిత్ర:—హితవును వినరుగా !

అర్జు:—మీరు సామసాధ్యులుగారుగా !

చిత్ర:—అగును. సాధ్యులముగాము. అసాధ్యులము.

అర్జు:—హితకరమగు వచనములు ప్రియకరములు గావు. కానిమ్ము; కాచికొమ్ము. నీచేతనే మాపనిఁ జేయించె దము పద. [ప్రక్కకుపోయి యుద్ధము చేయుచుందురు. రెండవప్రక్కనుండి నకులసహదేవులు ప్రవేశింతురు.]

సహ:—ఏమన్నా ! మనమనిన మనయన్నల కింతప్రేమ. ఈ పాటియుద్ధమునకే కందిపోవుదమని విశ్రాంతియా ?

నకు:—దిగ్గజములగు యిద్దఱన్నలు పోరుచుండ మన మెంత ! మనయుద్ధ మెంత !

సహ:—కానిమ్ము. కొంచెముయుద్ధము సాగినవెనుక మనమే వారికి విశ్రాంతి నీయవచ్చును.

నకు:—(తనలో) ఏగూటిచిలుక ఆగూటిపలుకులు పలుకును. (ప్రకాశముగా) తమ్ముఁడా ! అటు చూడుము.

సహ:—ఏమన్నా ! మనభీమన్న పరాక్రమము.

నకు:—ఈ అన్నను చూడుము. తేరు భగ్నముగావింప నిర్జరు లేసిన నారాచంబులన్నియుం దునుమాడి వారిలో నెట్లు క్రీడించుచున్నాఁడో !

సహ:—పాపము ! గంధర్వులు నొచ్చినారు.

నకు:—యుద్ధముసేయునెడ దయాదాక్షిణ్యములకుఁ దావుండ కూడదు.

సహ:—అదిగో! గంధర్వులు గగనమార్గముబట్టి పరువెత్తి పోవుచున్నారు. ఎట్లు?

నకు:—మనయన్నయంత వెఱ్ఱివాఁడనుకొనుచుంటివా! వారి ముందుచూడుము. శరజాలములచే దిఙ్నభోభాగములను నీరంధ్రముగాఁ గప్పినాఁడు.

సహ:—(నవ్వి) పిట్టలు వలలోఁ జిక్కినట్లు జిక్కినారు.

నకు:—అయినను బోరునను నుక్కనను జిక్కకున్నారు.

సహ:—వారీదిశకు వచ్చుచున్నట్లున్నదే. మనయన్నయొక్కఁడే వచ్చుచున్నట్లున్నాఁడు. గంధర్వులేరో!

నకు:—అంతర్హితులై పోరుచున్నారు.

అర్జు:—[ప్రవేశించి] ఏమి! యీమాయాబలము! ప్రత్యక్షముగా బోరినగదా జయమో! అపజయమో!

సహ:—వైరులుకనరారు. శరములు కుప్పతిప్పలు.

అర్జు:—కనుపడు శరము ఖండింపుచుండుఁడు, తమ్ములారా! [తెరలో గర్జనలు వినఁబడును.] అదిగో! ఆగర్జనలు గ్రుడ్డిలోమెల్ల, రవంతమేలు. శబ్దవేదులైన సాయకములచే నొప్పింప ప్రయత్నించెదను (బాణములు వేయుచుండును).

[చిత్రసేనుఁడు ప్రవేశించును]

చిత్ర:—విజయా! దేవాంశ సంభూతులతో ఖేచరమాత్రులము పోరఁగలమా!

అర్జు:—వీరోత్తమా! మాతో వైరమేల?

చిత్ర:—ధనంజయా! మీతో వైరమా! ఆప్తులతోనా?

ఆ॥ వె॥ ఇంద్రసూనుఁడీవు ఇంద్రపాలితు నేను
నీదెసఁగ విరోధమేది లేదు
నానిగొనఁగ మేము పూనియున్నారము
మాకు మీరలడ్డురాకుఁడయ్య!

అర్జు:—ఖేచరధీరా! అయినను

ఆ॥ వె॥ ఈసుయోధనుండు మేమన్నదమ్ముల
మయ్య! అట్లు గాన నడుగవలసె
విడువవలయు నితని విశ్వజ్ఞుఁడైన మా
ధర్మనందనుని ముదంబుకొఱకు.

చిత్ర:—ఫల్గుణా!

ఉ॥ ఈదురితాత్ముఁడిందుమిము హేళనఁ జేయఁగవచ్చినాఁడు మీ
సోదరుఁడా! విషోదరుఁడు సుండి విరోధిని వీని దారపు
త్రాది సమస్తబంధుల దయారహితంబుగఁబట్టి కట్టి న
న్నాదురితమ్ము నాప నిటకంపె నిలింపుఁడు మీకుమారుగా.

అర్జు:—అవును. దురితము నాపితివి. వచ్చినపనియైనది. ఈతని గట్టి తీసుకొనిరమ్మని-

ఉ॥ మిమ్మసురేంద్రుఁడంపినను మీఁదనింకేమైనఁ వినుండున్యా
యమ్మనుమీరనట్టి యనఘాత్ముఁడు ధర్మసుతుండుగాన స
ర్వమ్మెఱిఁగింపనచ్చటకుఁ రండతఁడేయది చెప్పనో యటుల్
చిమ్మటఁజేయవచ్చుయిదిమీకునుమాకును మేలుమార్గమా.

చిత్ర:—యువరాజునాజ్ఞ రాజాజ్ఞవంటిదే. పదుండు.

సహ:—(తనలో) ఈ తెలివి మొదట నేలలేకపోయెనో!

[అందఱు నిష్క్రమించుచుండగా]

తెర పడును.

---

## మూఁడవ రంగము

[ప్రదేశము:- పాండవుల ఆశ్రమము. ప్రవేశము:- ధర్మరాజు పూజింపుచున్న చిత్రసేనుఁడు, భీమార్జుననకులసహదేవులు, నారదుఁడు, కట్లతో దుర్యోధనాదులు.]

ధర్మ:—(పూజింపుచు)

ఉ॥ ఓమహితాత్మ! ఇంతకుసుయోధనుఁడందరితోడఁగూడి మీ
చేమడియాగలేదదియె శ్రేయముమేలును మీపరంబుగా
మామరియాద కేమియును మచ్చలుగల్గవు నేఁటిదాఁక వీఁ
డేమొనరించినన్ విడువ్రుఁడీ మముఁజూఁచి సహించిమాకుగా.

చిత్ర:—(సంతోషముతో)

ఉ॥ మేలుఘటించువారలకె మేలుఘటించెడుబుద్ధి పూనఁగాఁ
జాలరుమానవుల్ మనసుచాలునె కీడుఘటించువారికిన్
మేలుఘటింప? అట్టియెడ మిమ్మవమానముసేసి కానకున్
ద్రోలినక్రూరునే దయన్ బ్రోచితి వెంతటిధర్మశాలివో!

ధర్మ:—అంత స్తోత్రమునకర్హుఁడగాను. మాతమ్ములు నా

యాజ్ఞచే మీకొనరించిన మెగ్గునకిదియే క్షమార్పణ (చేతులు జోడించును).

చిత్ర:—ఎంతమాట ధర్మరాజా ! 'ధర్మమేవజయతు'. మఱి మాకు సెలవా ?

ధర్మ:—చిత్తము. [గంధర్వులు నిష్క్రమింతురు. ధర్మరాజు సుయోధనుని గట్లువిప్పుచు]

ఉ॥ అన్నయిదేలనయ్య!యిటులామహనీయులతోడఁగయ్యమా?
ఎన్నడుసాహసింపకిటు లిమ్మ్మలబొమ్మ్మ పురమ్ముఁ జేరఁగా
తిన్నఁగ దీనినింకొకవిధిఁ దలకింపక మోదమొందు మా
ఎన్నరుఁడీట్లు సాహసములింక ఘటించునో వాఁడలఘుగా.

నార:—సార్వభౌమా ! నీధర్మపత్ని మాటలఁగూడఁ ద్రోసి పుచ్చి గొప్పఫలముబొందితివే! పాపమదిగో చూడుము! నీయర్ధాంగిని—

[అంత తెర యెత్తఁగా— ప్రదేశము:—పాండవుల ఆశ్రమపు లోపలిభాగము; ప్రవేశము:—భానుమతీద్రౌపదులు)

ద్రౌప:—(ఓదార్చుదానివలె)

చ॥ చెలియల! యేమిపాపమును జేసినవారమొ దాయభాగపుం
గలహములందు నేనిటులఁగానలలోనను నీవు నిట్లు శ
త్రుల వలఁజిక్కి కష్టములతోఁ దలవంపులఁబాలుగాఁగ! నో
ములు వ్రతముల్ ఘటించి యిటు బొందితిమమ్మ మహాను
భావులన్.

భాను:—అక్కా! "మహానుభావుల"ని ప్రాణనాథుల నీవంటి పతివ్రత యాక్షేపింపవచ్చునా? చిన్నదానను నేనా నీకుఁ జెప్పుదానను?

ద్రౌప:—అట్లనెదవేమి? వారు నిశ్చయముగ మహానుభావులే! కానినాఁడావారు పరిభవింపఁబడుచుండగాఁ జూఁచి మిన్నకుండఁ గలరా? నాఁడు మావారు నేఁడు మీవారు.

భాను:—అక్కా!

గీ॥ అత్తమామలఁ బంపున నాలఁజూడ
వచ్చినేఁ డిటుల పరాభవమునుఁజెంద
నీపతులు బ్రోచినారలు నెమ్మితోడ
వారిమేలును మరతుమే? మారుమేలుఁ
జేయఁజూఁచిన స్నేహితులే జేయనీరు.

ద్రౌప:—(పరిహాసముగా) అట్లనెదవేమి భానుమతీ!

ఉ॥ మీరెవరమ్మ! ఇంతకును? మేలుఘటించుటకేమి వీరుపై
వారలె? బంధువర్గము వివాదములెంతురె? ఐన చెల్లి! బం
గారపు పళ్ళెరంబగునుగాక యవశ్యముగోడచేర్పు మొ
వ్వారు గ్రహింపరిద్ది అనుభవంబున దీని గ్రహింతురీవిధిన్

భాను:—అక్కా! నీపలుకులు ములుకులవలెనున్నవిసుమా!

గీ॥ పెంచి చంపెడువారును బెట్టి దెప్పు
వారు నాపదఁగాచి దుర్భాష లాడు

వారు నోకజాతిలోఁ జేరువారలందు
రేలఁ దెప్పెదవమ్మ యీలీల మమ్ము.
(ద్రౌపది పాదములఁబడి) అక్కా ! వారుచేసిన నేరము నాకుగా సహించి క్షమించి ధర్మపత్ని వనుపించు కొనుము.

తెర పడును.

---

## నాల్గవ రంగము

[ప్రవేశము:—ప్రయాణమార్గమధ్యమున మజిలీలో గుడారమున సుయోధనుని యభ్యంతరమందిరము; ప్రవేశము:—లజ్జా కలితహృదయుఁడైన దుర్యోధనుఁడు, ప్రక్కఁ గర్ణుఁడు.]

కర్ణు:—రాజా ! యేమిచేయను ?

మ॥ రథమా!భిన్నములయ్యె చుట్టుఖచరుల్ దట్టించియున్నారు సా
రథియా! జూడఁగ నేలఁ గూలెనిఁక నాప్రాణంబులా లీపి యా
యుధమా! చేతను లేదు యొక్కరుఁడనే యుత్సాహమా తగ్గె నే
విధి నేపోరఁగలాఁడ మాయయనిలో విఖ్యాతులా వారితో.

దుర్యో:—(మాటలాడక యూరకుండును.)

కర్ణు:—(తనలో) ఈ రాజునకు నాపై నాగ్రహము మెండుగా వచ్చినది. ఏమిచేయుదును ? ఈతనిఁ బ్రసన్నునిజేసు కొనుటెట్లో గదా ! (ప్రకాశముగా) రాజా !

ఉ॥ ఎక్కడి పౌరుషంబు లవి ! యెక్కడివీరులు వారు జూడ నిం
కెక్కడిసాధనంబులు ! మరెక్కడిమాయల వట్టిచోటనే
యుక్కనవీరి శాత్రవులనొక్కఁడ వీవెటులుక్కడంచితో
యెక్కడిరాజవయ్య ! అసురేంద్రునిఁగూడలఁదన్నజాలుదే !

దుర్యో:—(తనలో) దాసునిపాట్లు పెరుమాళ్ళకేమెఱుక? పాటి వచ్చినను నాకన్న నితఁడే యదృష్టవంతుఁడు. (ప్రకాశముగా) ఏమిచెప్పనోయి సఖా !

ఉ॥ తమ్ములఁగూడి నేపలువిధమ్ముల ఖేచరకోటిమీఱ యు
ద్ధమ్ము ఘటింప పోర్మిగుల దారుణమై బలయుగ్మమీఱగ ఘో
రమ్ముగ చిత్రసేను నెదురంగలవారలు లేక నే ప్రయ
త్నమ్మునఁ బోరినొచ్చితిని నాకొకఁడేనియు లేఁడు తోడుగా.

కర్ణు:—అయ్యో ! యెంతపని జరిగినది.

దుర్యో:—ఇట్టి వాక్కేనియనుటకు నీవైన లేకపోయితివిగా. అప్పుడు నన్ను సకుటుంబ బంధుమిత్ర సపరివారముగా బంధించి గంధర్వపతి గగనోన్ముఖుఁడయ్యెను.

కర్ణు:—ఔరా ! ఎంతఁజేసెను.

దుర్యో:—అంతటితో నాగెనా ? మేలే. ఆతనిచే శిరస్తాడనంబుచేయఁబడితిని. రాజును (ఇటునటుజూఁచి) చెప్పకొనక తప్పదు.

కర్ణు:—శిరస్తాడనమే ? అవాచ్యమే ! ఎంతదుర్మార్గుఁడు !

దుర్యో:—దానితో సరిపోయినదీ ?

కర్ణు:—ఇంకను నేమైనది దేవా!

దుర్యో:—శేషించిన మనవారు ధర్మరాజు పాలఁబడిరి.

కర్ణు:—పిదప?

దుర్యో:—భీమార్జునులువచ్చి వారికౌశలమును జూపిరి.

కర్ణు:—ఎవరోడిరి? పాండవులేనా!

దుర్యో:—పాండవులోడిన నేనిక్కడికెట్లువచ్చియుందును?

కర్ణు:—మఱి?

దుర్యో:—నయమున భయమున వారు గంధర్వుల నొప్పించి యొప్పింపఁ బ్రయత్నించిరి. కాని లాభములేకపోయినది.

కర్ణు:—చివరకేమైనది?

దుర్యో:—ఘోరయుద్ధమైనది. ఇంద్రుని పనుపగుట మమ్ము విడువమని చిత్రసేనుఁడు, ధర్మజుని పనుపగుటచే విడిచి తీరవలెనని విజయుఁడు పెనగులాడిరి.

కర్ణు:—ఆపైన!

దుర్యో:—ఆకాశమున కంపకట్టుగట్టి పాఱిపోయెడు గంధర్వుల నడ్డి యర్జునుఁడు, అంతర్హితులై గంధర్వులు, అంతర్హితులైనవారిని శబ్దవేదులచే హింసించి ధనంజయుఁడు నీవిధముగఁ బోరిరి. చివరకు చిత్రసేనుఁడు సంధికొడంబడెను.

కర్ణు:—సంధికే! ఒడంబడుటే అబ్బా! తర్వాతనేమైనది?

దుర్యో:—

కం॥ మనమంతనంబులన్నియు

వినినట్టులఁజెప్పెనయ్యొ......

నను అసుర్మార్గుఁడు బాధనంబులతో ధర్మరాజు పాదములయొద్దఁ బడవైచెను.

కర్ణు:—అయ్యో! యెంతమోసము.

(శకుని ప్రవేశించును.)

దుర్యో:—ఔరా! మామా! ఎంతబ్రతుకుబ్రతికి యెట్టిదశకు వచ్చితినయ్యా!

ఉ॥ అంచితమౌ మహారణమునందునఁ జచ్చినమేలుసుమ్మి యీ
క్రించుదనంబు లేక గడుకీర్తియుఁ గల్గియెయుందు నేను జీ
వించి ఫలంబదేమి? పృథివిన్ ఎటులేలఁగలాఁడనయ్య యే
మంచుఁ జరింతుబాంధవుల యందఱిలోఁ దలవంపుగాదొకో!

శకు:—శాంతింపుము సుయోధనా! విచారింపకుము.

(కర్ణునివైపుఁ జూచును.)

కర్ణు:—

మ॥ తగునా! సోమకులోత్తమా! ఇటులనెందాకన్ విచారింతువో
మిగులన్ బోయిన దానికింక వగవన్ మేలేమి వాటిల్లు నిం
పగునే బాలిశురీతి నీయసువులన్ బ్రాయోపవేశాన బా
యగ! మాకెట్టులనుండు? మాకొఱకుగానైన న్దయంబూనవే!

పాండవులచేత విముక్తుఁడ నైతినని విచారింతువా!
వారెవరు ?

దుర్యో:—నాజ్ఞాతులు.

కర్ణు:—కాదు - నీసేవకులు.

దురో:—ఎట్లు, జీతమా! భత్యమా—

కర్ణు:—అక్కఱలేదు చూడుము.

ఉ॥ నీదగు రాజ్యమందు నవినీతులు పాండవులైన సంతతా
మోదమునంద నేలితివి భూమిని—

కం॥ ఏరాజేలెడి భూమిని
ఈరీతిఁ బ్రజలు సదా సుఖించుచు నుంద్రో
ఆరాజ్యములో మానవు
లారాజుని బంట్లుసుమ్మి న్యాయంబిదియే ?

—వారలు నీకుబంట్లు నీ
పై దయయేల ? అక్కఱకువచ్చుటవారల కర్తృకృత్య మొ
డేదియులేదు దీనను మతేలవిషాదము నీకు నొందఁగన్.

మఱియు—

ఉ॥ దీనులువారలెల్లరు నధీనులు జూదమునాటగోలె నీ
మానమునిల్పు భారముసమానము బంటుల యంతమందికిన్
గానలవాసముండుట ననారతముక్ నిను గొల్వకున్న నే.
డైనను దీర్పకుందురొకొ! యక్కఱపాటున నాజ్ఞసేయఁగన్.

ఏమి శకునిమామా !

శకుని:—అగునయ్యా !

దుర్యో:—కానిబావా! నన్ను బాధింపకుము. ఓయిదుశ్శాసనా!

దుశ్శా:—(ప్రవేశించి) ఏమిసెలవు ?

దుర్యో:—నాకు నేయాశలును లేవు. దుశ్శాసనా ! నీవుదీర్పఁ దగిన దొకటిరయే.

దుశ్శా:—అన్నా ! ఏమది.

దుర్యో:—

ఉ॥ ఆసనశించెరాజ్యమున నాశలులేవిఁక ప్రాణమందు దు
శ్శాసన ! నీవురాజవు విశాలప్రపంచము నీది యిద్దినా
శాసనమయ్యె! కర్ణుఁడును సౌబలుఁడు న్నినుజూఁచువారలా
వాసవుఁడేలునట్లు హితవర్గము బంధులు మెచ్చనేలుమా !

దుశ్శా:—ఔరా !

ఉ॥ దిక్కులుక్రుంగెనో! ఇనుని తేజముతప్పెనో! చంద్రుఁడీల్గెనో!
రిక్కలుగాలెనో! నిధియదృష్టముపాల్పడి యింకిపోయెనో!
ఎక్కడిమాటలాడెదవు! ఈవువహింపని రాజ్యమేలఁగా
నక్కట నావశంబె! తగునా యటుచెప్పఁగఁజేయ సోదరా !

శకు:—సెబాస్. మేలుగా చెప్పినావు దుశ్శాసనా.

రాజా!

చ॥ కడగిమనోబలంబున నకంటకముంబొనరించి నీకు నే
బుడమిసమస్తమిచ్చితిని భోగములొందుచు నేలయేలుచుజ్
గుడువగలేక దానినిటుఁగూలఁగఁదన్నఁదలంచి ప్రాణముల్
విడిచెదనంచుబల్కెదవు వెఱ్ఱియొ! పిచ్చియొ! కౌరవేశ్వరా!

దుర్యో:—ఎందులకీవెఱ్ఱి పిచ్చివానితో మీకు ?

శకు:—ఏమది సుయోధనా !

ఉ॥ ఏలవిచారమయ్య ! ఇలనేలెడిరాజవునీకు నింతగా
గోలయిదేల కూటికిని గుడ్డకు యోగ్యతలేదె భూమిపై?
మేలొనరించువారలకు మేదినినిమ్మనగన్న వారు మీ
ర్పాలునునీరు నేకమగు భాతిజరింపుఁడు మేలుగల్గగా.

దుర్యో:—మామా ! రెంకుతత్వంగాక యెట్లు నెట్లిముడఁగలవు?
నీవంటివానికిఁగూడ నెన్నిమారులు చెప్పవలయును.
అయిన నూరక యెందులకు నన్నింతగా గారించెదరు ?
ప్రాయోపవేశమున నే దృఢనిశ్చయుఁడను.

కర్ణు:—ఈతని మనస్సు నారదుఁడే త్రిప్పవలయును.

శకు:—ఇపుడు నారదుఁడే తెంచిన బాగుండియుండును నే.

(తెరలో మహతీగానము.)

దుర్యో:—అదుగో ! నాకొంపఁగూల్చిన కొంటెనారదుఁడు.
నేనువేగిరం పడవలె. నాకేకోరికయునులేదు. అయిన
నిది యగునుగాక !

## భరతవాక్యము

ఉ॥ నాయటులెవ్వరుం బుడమినాథులు దుర్మనులై చరించియే
మాయ మెఱుంగకుండిన యమాయకులం గని శృంగ
భంగముం
జేయఁగఁబూని తా మెవడిచిక్కి కృశించి నశింపకుండగా
జేయుత! లోకరక్షకుఁడు చిన్మయరూపుఁడు భక్తపాలుఁడున్.

సమాప్తము.



Pages No. 25—94, Printed at S. R. P. Works, Cocanada.

# తప్పు ఒప్పుల పట్టిక

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 1 | 4 | వాక్సుద్ధి | వాక్శుద్ధి |
| 2 | 3 | నెఱసు | నెరసు |
| 2 | 4 | అభిప్రాయయుల | అభిప్రాయముల |
| 7 | 9 | దవలంపు | దలవంపు |
| 7 | 20 | నీటు | నీటఁ |
| 9 | 13 | మార్ఖుఁడు | మూర్ఖుఁడు |
| 9 | 13 | పుట్టమన్ | పుట్టమున్ |
| 18 | 7 | నాద :— | నార :— |
| 19 | 17 | దుర్యాధన | దుర్యోధన |
| 20 | 3 | యెకింత | యొకింత |
| 20 | 15 | నికింప | నింకింప |
| 22 | 5 | సాముతవృధ | సామెతవృథ |
| 23 | 18 | యొపేక్ష | యుపేక్ష |
| 23 | 22 | దారింప | వారింప |
| 36 | 13 | నివశించు | నివసించు |
| 43 | 12 | స్థంభము | స్తంభము |
| 49 | 3 | నుఱుగు | నురుఁగు |
| 55 | 11 | దుర్వార | [దుర్వార] |
| 56 | 15 | నెఱుంగ | నెఱుఁగ |
| 59 | 21 | పరాక్రమణ | పదాక్రమః |
| 67 | 13 | కీడ | నీడ |
| 67 | 15 | కీడ | నీడ |

| పేజీ. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 68 | 2 | వచ్చితినో | వచ్చితినొ |
| 68 | 3 | వచ్చినానో | వచ్చినానొ |
| 69 | 2 | దగునే | దగునీ |
| 71 | 12 | గడుప | గడప |
| 72 | 2 | యుండ | యాండ |
| 72 | 10 | యా | యా |
| 72 | 20 | యివి | ఇవి |
| 73 | 20 | యొరులు | ఒరులు |
| 73 | 21 | నూత్రైను | నూత్రైను |
| 75 | 18 | చాలుఁగా | చాల్ |
| 75 | 20 | | వాంఛింతురే ? |
| 76 | 5 | యొంచకయే | యొంచకయె |
| 77 | 20 | శెంకలమేని | లెంకలనేని |
| 79 | 7 | యాక్రమింప | ఆక్రమింప |
| 79 | 9 | యెర్ల | యొళ్ళ |
| 83 | 5 | వాని | వీని |
| 83 | 8 | మేమన్న | నేమన్న |
| 83 | 19 | నింకేమైనఁగా | నిఁకేమయినఁగా |
| 85 | 10 | నో వాఁడలగుగా | నొ వాఁడడంగుగా |
| 86 | 13 | హితులే | హితుల్ |
| 86 | 18 | రిద్ధి అనుభ | రే యనుభ |
| 88 | 11 | నన్బోరి | నఁబోరి |

*Copies can be had from :*

**Malyala Jayaramiah**

**Kotla Lodge, Rajahmundry.**

**or**

**Malyala Jayaramiah**

**Pleaders' Street, Peddapuram.**

